

# మహాకవి దాసు శ్రీరాములు జయంతి సంచిక

ఏప్రిల్ 1975

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున ప్రచురితము

# మహాకవి దాసు శ్రీరాములు
# జయంతి సంచిక

ఏప్రిల్ 1975

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున ప్రచురితము



ప్రచురణ :

మహాకవి దాసు శ్రీరామ స్మారక సమితి

వాణీసదనము, 3-4-885/A బర్కతుపుర,

హైద్రాబాదు - 27.



## విఘ్నేశ్వర స్తుతి

### సురట రాగము - ఆదితాళము

గణాధిపతిమీశే - హంశ్రీగణాధిపతిమీశే ॥గణా॥

గుణగిణఘణ నాగణి తమహం శ్రీ ॥గణా॥

౧ వాగీశాద్యా స్సుమనసో నశం సర్వధానా ముపక్రమే

యనంత్వా కృత కృత్యాస్స్యుస్తం ॥గణా॥

౨ శుక్లాం బరధర మనఘం విష్ణు - శశధర వర్ణం

చతుర్భుజం - ప్రసన్న వదనం - ఖంజిత మదనం ॥గణా॥

౩ యం బ్రహ్మణ్యావదంతి - పరమందాన్యే విశ్వోత్పత్తి

కారణం తం దాసు శ్రీరామపోషకం.

---

దాసువారి ఇలవేల్పు

## కామేశ్వరి స్తుతి

### వసంత రాగము - రూపక తాళము

నాదానంద రస లహరీ కాదంబినీ కామేశ్వరి ॥నాదా॥

నాదు మనవి విను బదరీ - నారాయణ సోదరి గౌరి ॥నాదా॥

నీపట్టిని నను చేపట్టుమికను కాపాడ నీవేగతి-

గావెరావె కౌమారి - నాదానంద ॥నాదా॥

# వి ష య సూ చి క



## యేకఫణి నాగబంధము

శ్రీమన్నామ ప్రదశ్రీ - రధిక గుణ గణ - ఖ్యాతి భూరి స్థిరాత్మా
రవ్యాథ శ్శాంతమాయ స్సమధి సుకలా సౌమ్యరమ్యత్వమేతి
దాసు శ్రీరామ నామా - భవతు సతుచిర - శ్రేయసే దత్త సౌఖ్యః
కల్యత్వ శ్రీరిరంసు - స్సకలకవిరసే - నాదృత స్స్వైరధామా॥

—బ్ర॥ శ్రీ॥ పన్నాల సీతారామ బ్రహ్మశాస్త్రి గారు

# నివేదనము

క్రీ॥ శ॥ 19 వ శతాబ్ది ఉత్తరార్థమున తెలుఁగు దేశమున జీవించి, ఆంధ్ర సాహిత్యమును తమ అమూల్యమైన రచనలచే అలంకరింపఁజేసిన మహాకవులలో శ్రీ దాసు శ్రీరాములు గారొకరు. వారు న్యాయవాద వృత్తి చేపట్టినను ఆంధ్రభారతీ సమారాధనమును సంతతము తమ కవితావృత్తిగా సాగించిన మేటి కవులు. గీర్వాణాంధ్రాంగ్ల పారశీక భాషాకోవిదులు. శ్రీరామకవి కవితా వ్యవసాయము శ్రీనాథ కవివలె పంద్రెండవ యేటనే ప్రారంభమైనది. శతకములు, ప్రబంధములు, పురాణములు, నాటకములు, శాస్త్ర గ్రంథములు- ఇట్లెన్నో ప్రక్రియలలో వారు కావ్యరచనలు గావించి యుండిరి. వారి శతకములలో సోమలింగ శతకము, రఘునాధ శతకము, సూర్య శతకము, చిలుకల కొలికి శతకము, ముద్దులగుమ్మ శతకము, సంస్కృత కామాక్షి శతకము మొదలగునవి ప్రసిద్ధములు. కావ్యములలో సాత్రాజితీ విలాసము, కృష్ణార్జున సంగరము, పంచ నృశింహ క్షేత్ర మాహాత్మ్యము, లక్షణావిలాసము, మొదలగునవి యెన్నఁదగినవి. తెలుగులో వీధి ప్రక్రియకుఁజెందిన 'తెలుగునాడు' ప్రత్యేకముగా పేర్కొన దగినది. వీరి నాటకములలో మంజరీ మధుకరీయము, మనోలక్ష్మీ విలాసము, కురంగ గౌరీ శంకరము, ఆంధ్రీకృత శాకుంతలము, రత్నావళి, మహావీర చరితము, ముద్రారాక్షసము, ఉత్తరరామ చరితము మొదలగునవి ముఖ్యమైనవి. వీరి రచనలన్నియు నొక యెత్తు, వీరి దేవీభాగవత పురాణ మొక్కటి యొక యెత్తు, ఆంధ్రమున వెలసిన దేవీభాగవతములలో దీసికున్న ప్రాశస్త్య మనన్యసామాన్యము. వారికి మహాకవి గౌరవమును కల్పించు గ్రంథరాజము దేవీభాగవతము.

మహాకవి దాసు శ్రీరాములు గారు అధునికాంధ్ర కవిత్వ యుగకర్తలైన తిరుపతి వేంకటకవుల ప్రశస్తి నందినవారు. వారి దేవీ భాగవతము, తెలుఁగునాడు కృతులలోని పద్యము లిప్పటికిని పండితుల నాలుకలపై నాట్యమాడుచున్నవి. ఇంతటి ప్రజాదరణ పొందిన శ్రీరామ కవీంద్రుల కృతులిప్పుడు పాఠకలోకమున కందుబాటులోలేవు. వానిని పునర్ముద్రించి ప్రజల కందించవలసిన యవసర మెంతైన కలదు.

ఈ యవసరమును దృష్టియందుంచుకొని, దాసు వంశమునందు జన్మించి, ఆ మహాకవి యశస్సును వారసత్వముగా ననుభవించుచున్న మేమందరము కలిసి మహాకవి శ్రీ దాసు శ్రీరాములు స్మారక సమితి, హైదరాబాదులో 1978 వ సం॥ డిసెంబరు నెలలో స్థాపించితిమి. ఆ మహాకవి గ్రంథములను ప్రచురించుట ద్వారా వారి సాహిత్యమును నేటి తరమున కందుబాటులో నుండునట్లు చేయుట, వారి పేరు చిరస్థాయిగా నుండునట్టి ప్రజాహితోపకారములైన కొన్ని ప్రణాళికలను చేపట్టుట - అనెడి లక్ష్యములతో ఈ సమితి కృషి నారంభించినది.

మహాకవి దాసు శ్రీరాములు రచించిన తెలుఁగునాడు తెలుగునాట ఆబాలగోపాలము నలరించిన పద్యగ్రంథము. క్రొత్త పద్ధతిలో నడచిన వీధి. తెలుగువారి నాటి యాచార వ్యవహారములను దెలియుట కుపకరించు కవితాకరదీపిక. అందువలన. దాని నీ ప్రచురణ కార్యక్రమములో మొదటి గ్రంథముగా వెలువరించుట జరిగినది. రెండవదిగా అభినవ గద్య ప్రబంధమును ప్రకటించరమైనది. ఆ తరువాత దేవీ భాగవతము ముద్రింపవలెనని ప్రయత్నములు జరుగుచున్నవి. క్రమముగా వారి ముద్రితాముద్రిత గ్రంథముల నన్నింటిని ప్రచురించి ప్రజల కందించుట ఈ సమితి మొదటి ధ్యేయము.

మహాకవి దాసు శ్రీరాములు గారి 180 వ జయంతి సందర్భమున ఈ సంచికను ప్రచురించుటకు మాసమితి సంకల్పించినది. వారి జన్మదినము ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న తరుణములో సంభవించుటచే ఈ సంచికను ప్రచురించి ఈ సభలలో పాల్గొను తెలుగు రచయితలకు, మిగత పెద్దలకు ఈ సంచిక నందించవలెనని మా యభిలాష.

ఈ జయంతి సంచికకు తమ అమూల్యమైన వ్యాసముల నిచ్చిన పెద్దలు కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, కళాప్రపూర్ణ ఆచార్య నిడదవోలు వెంకట్రావు, డా॥ పాటిబండ మాధవశర్మ, శ్రీ జి. కృష్ణ, శ్రీ విశ్వనాధ వెంకటేశ్వర్లు గార్లకు మా కృతజ్ఞతా పూర్వక వందనములు. ఈ సంచికకు తమ సంస్థల అడ్వర్‌టైజుమెంట్లు యిచ్చి ఆర్థికముగా సహాయపడిన వదాన్యులకు మా హార్దిక కృతజ్ఞతాభివందనములు.

శ్రీ దాసు శ్రీరామకవిని గూర్చిన విశేషాంశములు గానీ, వారి లిఖిత ప్రతులు గాని, పాత ప్రచురణలు గానీ ఎవరైన సేకరించియున్నచో వానిని ఈ సమితికి అందజేసి ఆ మహాకవి సాహిత్య ప్రచురణ కార్యక్రమమును దిగ్విజయముచేయ ప్రార్థించుచున్నాము.

హైదరాబాదు
1 – 4 – 1975

దాసు పద్మనాభరావు
అధ్యక్షుడు
మహాకవి దాసు శ్రీరాములు
స్మారక సమితి

బహుముఖ ప్రజ్ఞులు -

# దాసు శ్రీరామ పండితులు

—శ్రీ దిగవల్లి వేంకట శివరావు

మహాకవి, మహా పండితుడు శ్రీ దాసు శ్రీరాములు పంతులు గారి జయంతి సంచికను ఆంధ్ర లోకమునకు సమర్పించుట చాలా సంతోషకరమైన విషయము.

ఆయన గొప్ప పండితుడు, గొప్ప కవియు మాత్రమేగాక, గొప్ప న్యాయవాది, గొప్ప సంస్కర్త, గొప్ప దేశాభిమానియై యుండి 1846-1908 సంవత్సరముల మధ్య ఆంధ్రదేశ సాంఘిక, సాంస్కృతిక, మత రాజకీయాభివృద్ధి కొరకు పాటుపడిన మహా పురుషులలో నొకరు. ఆంధ్రదేశ ప్రజలకు, ఆంధ్ర భాషకు ఆయన చేసిన సేవ సామాన్యమైనదికాదు.

శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి గారు ప్రతి సభలోనూ శ్రీరాములు గారిని స్మరించి, ప్రశంసించే వారు. శ్రీరాములు గారి బహుముఖ ప్రజ్ఞ, ప్రతిభ ఆయన జీవిత చరిత్ర చదివితే గాని తెలియవు.

శ్రీరాములు గారి కుమారుడు శ్రీ విష్ణురావు గారు షుమారు 700 అరఠావు పుటలు గల దాసు వారి వంశ చరిత్ర అనే గ్రంథములో శ్రీరాములు గారిని గూర్చిన అనేక విశేషములు వ్రాసినారు. దానిని ప్రకటించడము అత్యంతావశ్యకము.

శ్రీరాములు గారికి సంస్కృతాంధ్రము లందును, ఇంగ్లీషులోను పాండిత్య ముండుటయే గాక అనేక శాస్త్రములందు పాండిత్యమున్నది. ధర్మశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, భరత శాస్త్రము మొదలైన వానికి సంబంధించిన చర్చలందు, సభలందు, సదస్సులందు వారు పాల్గొనేవారు. వారి యభిప్రాయములను, నిర్ణయములను ఆ యా శాస్త్ర పండితులు గౌరవించే వారు.

శ్రీ వీరేశలింగం పంతులు గారివలె భారత దేశ పూర్వ సంస్కృతి, సంప్రదాయములను నీతి, మత ధర్మములను తూలనాడక శ్రీరాములు గారు పాశ్చాత్య నాగారికతను, సంస్కృతి, సంప్రదాయములను జీర్ణించుకొని భారత దేశాభివృద్ధి కుపయోగించుకొను మార్గములన్వేషించి చాలవరకు కృతకృత్యులయినారు.

శ్రీరాములు గారు స్త్రీవిద్య నభిమానించినారు. సంఘసంస్కరణములను ప్రోత్సహించినారు. దేశోద్ధరణకై పాటుపడినారు.

తమ కుమార్తెకు విద్యాబుద్ధులతోపాటు సంగీతము, అభినయము నేర్పించిన ధైర్యశాలి శ్రీరాములు గారు. బ్రాహ్మణ కులమునకు ఆచారములకు సంబంధించిన అనేక సమస్యలను శ్రీరాములు గారు నేర్పుతో పరిష్కరించి సంస్కరణలకు మార్గదర్శియైనారు.

ఆంధ్ర వైశ్యుల వేదోక్త కర్మాధికారమును సమర్థించినారు. కమ్మకులము వారికి విద్యాగురువులైనారు.

శ్రీరాములు గారి జీవితము, ఉదారభావములు వారి సంతతి వారికే గాక ఆంధ్రు లందరికిని మేలు బంతియైనవి.

శ్రీరాములు గారి రచనలు పండిత పామరులకాదరణ పాత్రములైనవి. వారి దేవీ భాగవమును కొందరు పురాణము చెప్పేవారు. వారి తెలుగునాడు మొదలైన పద్యములు పోతన, వేమనల పద్యముల వలె నలుగడల వ్యాపించినవి. వారి కీర్తనలు భక్తుల నలరించినవి. జావళీలు రసికులనాకర్షించినవి. వారు యశఃకాయులైయున్న పుణ్యపురుషులు.



# మహాకవి దాసు శ్రీరాములుగారి జీవిత చరిత్ర★

ఈ పురుషుడు మా వంశములో వహించియున్న ప్రాముఖ్యతను బట్టి, వీరి చరిత్ర కొంత విపులముగా వ్రాయదలచి వ్రాయుచున్నాను. ఈయన శ్రీ కన్నయ్య కామమ్మ గార్లకు ఏక సంతానము. 1846–1908 వరకు 62 సంవత్సరములు జీవించిన మహాపురుషుడు. ఈయన 1846 సంవత్సరము ఏప్రియలు 8 వ తేదికి సరియగు పరాభవ నామ సంవత్సర చైత్ర శుద్ధ ౧౩ బుధవారం సాయంకాలము వేళలో కూరాడ గ్రామములో తన మాతామహుండగు కూరాడ రామచంద్రయ్యగారి యింట బుట్టెను. ఈయన పుట్టునాటికి మా తాతగారు కుటుంబముతో కొండ్రిగుంటపాలెములోనే యుండిరి. వీరికి చదువులను కొండ్రిగుంటపాలెములోనే జరిగినవి. తల్లిదండ్రులు అల్లూరు ప్రవేశించిన సంవత్సరములోనే అక్షరాభ్యాసమయి 6 నెలలు మాత్రము కొండ్రగుంటపాలెము కాపురస్థులు అడివి సుబ్బారాయుడుగారి వద్దనే చిన్న చదువు చదువుచు వచ్చిరి. తరువాత గుడ్లవల్లేటి కాపురస్థులు గుడ్లవల్లేటి పేరరాజుగారి యొద్ద కొన్నాళ్లు చదివినారు. ఇప్పటికి బాలరామాయణము అమరకోశములో కొంతవరకు మాత్రము చదువగలిగిరి. తరువాత గురుముఖతః యే విద్యను అభ్యసింపలేదు గాని తండ్రిగారి వద్దనే లెక్కలు చేయుట వ్రాత వ్రాయుట భారతాది గ్రంథముల జదువుటయు నభ్యసించిరి. వీరి తండ్రిగారు పండితులు గాకున్నను శ్రుతపాండిత్యము బాగుగా గలిగినవారు. కాని శ్రీరాములుగారు స్వభావసిద్ధముగా తెలివిగలవారును, మేధాశక్తి గలిగినవారును గావున ఆంధ్రము కొంత వరకు స్వయంసహాయమువలననే చదువుచు వచ్చిరి. ఇట్లు వీరికి 12 వ సంవత్సరము వచ్చినది. 1858 నలనామ సంవత్సరములో ఈయనకును, వీరి మేనత్త కుమారుడైన ఉప్పులూరి కృష్ణయ్య గారికిని ఉపనయనములు జరిగినవి. ఉపవీతుడైన కొన్ని దినములలోనే మా తాతగారి మేనత్తకుమారుడు అడివి వెంకటశివుడుగారు బందరులో నున్న అవకాశము తీసుకొని శ్రీరాములుగారిని తండ్రిగారు బందరునకు ఆంగ్లేయ విద్యాభ్యాసము నిమిత్తము పంపిరి. అప్పటికి సుమారు 14 ఏండ్ల క్రిందట అనగా 1843 సంవత్సరము నోబిల్ అను నొక క్రైస్తవ మత వ్యాపకుడు ఒక పాఠశాలను ప్రతిష్ఠించెను. ఆయన ఆ పాఠశాలలో కొందరు హిందూ బాలురకు కూడ క్రైస్తవ బాలురతోబాటు విద్య చెప్పుట ప్రారంభించినారు. ఇప్పుడే మన ప్రాంతముల ఆంగ్లేయ విధానమున విద్యను బోధించుట మొదలిడినది. శ్రీరాములుగారు బందరులో నోబిలు పాఠశాలలో విద్యార్థిగా నున్నప్పుడు హిందువుల బాలురను క్రైస్తవ మత వ్యాపకులు తమ మతములో కలుపుచుండుట తటస్థించినది. ఇట్టి సమయములో క్రైస్తవ మత స్వీకారమును చేసినవారిలో కీ. శే. దేవేంద్ర వేంకటాచలము పంతులుగారొకరు. శ్రీరాములుగారు విద్యార్థిగా నున్న కాలములో వీరి తెలివిని బుద్ధిని గుణమును చక్కగా గ్రహించి క్రైస్తవ మత వ్యాపకులు ఈయనను దయతో ప్రేమతో చూచుచు వచ్చిరి. ఇంతలో బందరులో క్రైస్తవమత వ్యాపకమును తలిదండ్రులు గ్రహించి తమ కుమారుడును చిన్నతనముచే క్రైస్తవమత స్వీకరణము చేయునేమో యను భీతిచెంది కుమారునకట్టి యే చింతయు లేనప్పటికి, కుమారుని పెత్తల్లి కుమారుడైన అడివి నాగభూషణంగారిని బందరున కంపి తిరిగి అల్లూరునకు రప్పించుకొనిరి. ఇంతటితో శ్రీరాములుగారి బస్తీఇంగ్లీషు చదువు తుదముట్టినది. తలిదండ్రులకు ఒక్క కొడుకు, పాడిపంటలు బాగుగా నున్నవి. మంచి నివాసయోగ్యమైన గ్రామము, తోటలు, దొడ్లు, ఆటలకు వీలయిన విశాల ప్రదేశములు, అవకాశము, తోడునకు మేనత్త కుమాళ్ళు, "బలమును నింటిలో జరుగుబాటును ." ఇన్ని గలిగి ఒక ప్రక్కను తన బాల్యక్రీడా వినోద

* శ్రీ దాసు విష్ణురావు పంతులుగారు రచించిన దాసువారి వంశ చరిత్ర నుండి

ముల స్వేచ్ఛగా జరుపుచు ఇంకొకప్రక్క స్వయం సహాయముతో సంస్కృతాంధ్రముల నభ్యసించు చుండెను. ఈయన తన బాల్యావస్థను ఎట్లు జరిపినది వీరి దేవీభాగవత పీఠికలోని అల్లూరు గ్రామ వర్ణనను తన బాల్యక్రీడాది విశేషములను చదివిన కన్నులకు గట్టినట్లు తెలియగలదు ఈయన బందరులో నున్నప్పుడు కవిత్వ బీజము లంకురించినవి. జయజయ సోమలింగ అనుకీర్తన అప్పుడల్లినాదట. 14 వ యేట సాత్రాజితీ విలాసమను నొక గ్రంథమును యక్షగాన పద్ధతిని రచించిరి. ఇది చిన్ననాడు చేసిన దయినప్పటికి ఇందలి కవిత్వము చాల రసవంతమై ప్రౌఢమయి యున్నది. ఇట్లు తన విద్యాభివృద్ధి జరుగుచున్న సమయమున కాళయుక్తి 1859 సంవత్సర మాఘమాసమున భయంకరమైన జ్వరము వల్ల పీడింపబడెను. దైవకృపచే నా గండము తప్పించుకొనెను. ఆదే కాళయుక్తి సంవత్సర ఫాల్గుణ బహుళ సప్తమి శుక్రవారమునాడు 1859 మార్చి 25 న వీరి వివాహము జరిగినది. తన పెద్ద మేనమామగారగు కూరాడ లక్ష్మీనరసింహముగారి ద్వితీయ పుత్రిక జానకమ్మ (కాంతమ్మ) నిచ్చి కూరాడలో వివాహము చేసిరి. (అప్పుడే లక్ష్మీనరసింహముగారి ప్రథమ పుత్రిక యగు శేషమ్మగారిని వీరి పెత్తల్లి వెంకమ్మగారి ప్రథమ పుత్రుడు అడివి నాగభూషణముగారికిచ్చి వివాహము చేసిరి అంతకు ముందే 8 దినములనాడు వీరి మేనత్తగారి పెద్ద కుమారుడగు కనకయ్యగారి వివాహమాయెను.) 1860 సిద్ధార్థిలో వీరి మాతామహుడు రామచంద్రయ్యగారు చనిపోయినారు. ఇట్లు విద్యావ్యాసంగము తోడను బాల్యక్రీడా వినోదములతో నుండుచు విద్యాతురత గలిగి 1865 సంవత్సర విప్రియలులో తలిదండ్రులకుగాని మరెవ్వరికిగాని తెలియజేయకనే యర్ధరాత్రమున ఇల్లు వెడలి సంస్కృత వ్యాకరణాదుల నభ్యసింప, ఆకిరిపల్లికి పలాయనులైరి. ఈ ఆకిరిపల్లి నూజివీడు సంస్థానములోనిది. నూజివీడు ప్రభువైన అప్పారాయణింగారలకు అభిమాన దైవమైన శ్రీ శోభనాద్రిస్వామికి నిలయమగు గ్రామమై యున్నది. అప్పటికి శోభనాద్రి అప్పారాయణింగారను మహాప్రభువు అఖండ నూజివీటి సంస్థానము నేలుచుండెను. ఈయన విద్యాభిలాషి. విద్యాపోషకుడు. రసికుడు. ఈ శోభనాద్రి అప్పారాయణింగారు 1868 లో చనిపోయినారు. అప్పటి యాకిరిపల్లి స్థితి సామాన్యముగాదు. విద్యాపీఠము. మహా విద్వాంసుల కాటపట్టు. గరికిపాటివారు, దేవులపల్లి వారు, సూరివారు మున్నగు తెలంగాణ్యశాఖా ప్రముఖులు విద్యాగురువులు. కడు దూరమునుండి విద్యార్థులు వచ్చి జమీందారుల ఔదార్యముచే నిక్కడ వేదశాస్త్రాదుల నభ్యసించినారు. ఇప్పటికిని ఆకిరిపల్లి కస్తూరి కట్టిన గుడ్డయే. ఇప్పటికిని నిక్కడ నొక సంస్కృత పాఠశాల నడుచుచునే యున్నది. కాని చాల వ్యత్యాసమున్నది. విద్యా వినోదములతో చెన్నారుచుండిన అప్పటి ఆకిరిపల్లి వ్యాజ్యాభూత తాండవములతో నిప్పుడు క్రాగుచున్నది. నిరాడంబరముగా విద్యాగోష్ఠులతో ప్రకాశించిన ఆకిరిపల్లి యిప్పుడు మోసాడంబరములతో అజ్ఞానాంధకారమున తడుపుకొనుచున్నది. అట్టి అప్పటిఆకిరిపల్లిలో నొక 10 మాసములు మాత్రము శ్రీరాములుగారుండి సంస్కృత వ్యాకరణము నేర్చినారు. వ్యాకరణశాస్త్రము ప్రధానముగా నేర్చినారను మాటయే గాని ఇతర శాస్త్రములలోను సాహిత్యములోను విస్తారపరిచయము పండిత సంపర్కమువల్లను తోటి విద్యార్థుల సంపర్కమువల్లను శ్రీరాములుగారు కలిగించుకొని యున్నారు. ఈ ఆకిరిపల్లి 10 మాసముల జీవనము, విద్యార్థిత్వము వారి విద్యాభివృద్ధికి చాల తోడ్పడియుండును. గరికిపాటి అప్పయ్యశాస్త్రిగారు, లక్ష్మణశాస్త్రిగారు, జోగిశాస్త్రిగారు మున్నగువారు శ్రీరాములుగారి అప్పటి సహాధ్యాయులో ఉపాధ్యాయులో యని శ్రీరాములుగారు చెప్పగా నేను చాలాసారులు విన్నాను. శ్రీరాములుగారి విద్యార్థిదశలో ఆకిరిపల్లి ప్రయాణము ముఖ్యముగా నెన్నదగినదే. ఆకిరిపల్లిలోనుండగాదినమునకు రు.0-8-0లు పంతు విద్యార్థివేతనము జమీందారుగారిపలన శ్రీరాములుగారు పొందిరి. ఆకిరిపల్లిలో 10 మాసములు కడిపి సుమారు ఆ సంవత్సర మార్గశిర మాసమునకు అల్లూరునకు తిరిగి వచ్చినారు. వచ్చిన కొలది దిన

ములకే సుమారు మాఘమాసములో భార్య జానకమ్మ కాపురమునకు వచ్చెను. సంస్కృత విద్యను దిన దినము అభివృద్ధి నొందించుకొని యుండిరి. అష్టావధాన వ్యస్తాక్షరీ ప్రశ్నలు వలవరచుకొని యప్పుడే నూజివీటి సంస్థానములోను వల్లూరు సంస్థానములోను వానిలో జయప్రదముగా పరీక్షలనీయగలిగిరి. అప్పటిలో నూజివీటిలో మాడభూషి వేంకటాచార్యులుగారు పెంటపాడు కాపురస్థులు, భరతాభ్యుదయ కృతికర్త సంస్కృతాంధ్రములలో కూలంకష ప్రజ్ఞావంతుడు ఉండెను* ఈ వేంకటాచార్యులుగారు ఏకసంతగ్రాహి యట. ఆ సమయమున వేంకటాచార్యులుగారు శ్రీరాములుగారి నుగ్గడించుచు "పదిరెండేడుల యీడుసంగవిత(జెప్పంబూని" పద్యమును చెప్పిరి. ఈ వేంకటాచార్యులుగారు ఏలూరులో మా యింటికి నా చిన్నతనములో వచ్చి మా నాయనగారితో ప్రసంగించుట నాకు స్వయముగా తెలియును. 1887 సంవత్సరములో జరిగిన విక్టోరియా మహారాణిగారి గోల్డెన్ జూబిలీ సమయములో ఉభయులూ వ్రాసిన ప్రశంసా పద్యములను ఒకరితో నొకరు చెప్పుకొని వాని వాని గుణముల స్నేహభావముతో పోల్చుకొని ఒకరినొకరు ప్రశంసించుకొనుట నేను విన్నదే. ఇక వల్లూరులో దీనికే తోటవల్లూరని పేరు.ఇది బెజవాడ తాలూకాలో కృష్ణా తీరమున నున్నది. శ్రీరాములుగారు పరీక్ష నిచ్చిన సమయములో బొమ్మదేవర నాగన్న నాయుడు బహద్దరుగారు జమీందారు. ఉదారులు, విద్యాపోషకులు, తెలగ కులస్థులు. అప్పటిలో మతుకుమిల్లి నరశింహశాస్త్రులుగారను నొక నియోగి పండితుడు ఈ యాస్థాన పండితుడుగానుండెను.2 ఈసంస్థానమునకు నాగన్న నాయుడుగారి తదనంతరము పాలనకు వచ్చిన ఆయన కుమారుడు వెంకట నరసింహనాయుడు బహద్దరుగారు మంచి తెలివిగలవాడు. పరిపాలనా సమర్థుడు. మృగములచే క్రీడలు సలిపించెడివాడు. యంత్ర నిర్మాణ ప్రజ్ఞాధురీణుడు. స్వయముగా భీమడోలునుండి తన నివాస గ్రామమైన పంగిడిగూడెమునకు రైల్వేరోడ్డు నాలుగు మైళ్ళు నిర్మించి పొగబండిని నడిపినవాడు. దర్పము గలవాడు. వ్యాఖ్యాప్రియుడు. సాహసవంతుడు. ధైర్యవంతుడు. తరువాత శ్రీరాములుగారేగాక శ్రీరాములుగారి కుమారులమైన మాధవరావుగారు, గోవిందరావుగారు, నేను, మధుసూదనరావుగారులు ప్లీడరీ చేయునప్పుడు ఈ నరసింహ నాయుడుగారికి ప్లీడర్లుగా నుంటిమి. వీరి కాలములోనే సంస్థానము భిన్నమై ఇప్పటికి ముక్కలై కొన్ని భాగములు పరాధీనములగుటకూడ తటస్థించినది. ఒకప్పుడు వీరి వల్లూరు సముతులో వ్యవసాయకుల వివాదము 1878 ప్రాంతమున ప్రబలినది. ధైర్యముతో అధికారులతో ఢీకొనిరి. అప్పుడు బెజవాడలో డిస్ట్రిక్టు మునసఫ్ చేయుచుండిన. కీ॥ శే॥ మున్నంగి రామయ్యగారు వీరి సంస్థానమునకు మేనేజరుగా నేర్పడి ఈ వివాదాలను సమయించిరి.

ఇప్పటికి ఒక విధముగా వీరి విద్యార్థిదశ అయినదనే చెప్పవచ్చును. కాని వారి జీవిత కాలమంతయు క్రొత్తవిషయములను గ్రహించుచునే యుండుటచేత ఆయన యావజ్జీవ విద్యార్థియనియే చెప్పవచ్చును. జ్ఞాన సంపాదనా తృష్ణ వారి కెప్పుడు తీరలేదు.

1867 ప్రభవ సంవత్సరము భాద్రపద మాసములో వీరికి ప్రథమ పుత్రుడు కేశవరావుగారు ప్రభవమైరి. 1869-70 శుక్ల సంవత్సరములో వీయనకు ద్వితీయ పుత్రుడు నారాయణరావుగారు జన్మించెను. 1871 ప్రజోత్పత్తిలో మాధవరావుగారను మూడవ కుమారుడు కలిగెను. ఈయన పుట్టిననాట నుండియే శ్రీరాములుగారు ప్రపంచ

* శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులుగారు 21-7-1872 తేదీన నూజవీడులో శతావధానముచేసిరి. నూజవీటి నారయ్యప్పారావుగారు సభాధ్యక్షులు. శ్రీ పిఠాపురం రాజా గంగాధరరామారావుగారు కవిగారికి "పండితరాయ" బిరుదము నిచ్చినారు. ఘనమైన సన్మానము జరిగినది.

2 మతుకుమిల్లి లక్ష్మీనరసింహశాస్త్రిగారు గొప్పకవి. 1816 సంవత్సరమున జన్మించి 1873 సంవత్సరములో దివంగతుడయ్యెను. 1863 సం॥ నాటి చెన్నపట్టణములోని స్థితిగతులను వర్ణించుచు చెన్నపురీవిలాస మను ప్రౌఢ ప్రబంధమును రచించెను.

వృత్తులలో ప్రవేశించినారు. 1871, 72 సంవత్సరములలో పుల్లరి యిజారాలను జేసి నష్టపడినారు. ఈ మహావ్యక్తికి అల్లూరు కడుచిన్నదై యుండుటచే తన విద్యాభివృద్ధికిని, తన పాండిత్య ప్రకర్షకును, తన యాశయముల పరిపూర్తత నొందించుటకు చాలనిదని యెంచి యశోవృద్ధిని గోరి యల్లూరు విడిచినగాని యివి సంభవిల్లవని బాగుగా గుర్తెరిగి అల్లూరు విడచుటయే మంచిదని లోలోన భావించుచుండిరి. ఇదే సమయములో వంగనామముల బాలకృష్ణయ్యగారను కైకలూరు డిప్యూటీ తహశ్శీలుదారు మున్నగు కొందరుద్యోగస్థుల ప్రోత్సాహముచే 1872-74 అప్పటికి అల్లూరు గ్రామమునకు తాలూకా గ్రామమైన గుడివాడలో ఇంగ్లీషు పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయుడుగా వెడలిరి. తలిదండ్రులకు ఈయన ఏకైక పుత్రుడైనను, పుత్రుని యాశయములకు విరోధముగా నడుచుట మంచిదికాదని యెంచి పుత్రుని యభ్యుదయమే యెక్కువగా తలచి పుత్రుడు తమను వీడిపోవుటకు అభ్యంతరము కలుగ జేయలేదు. ఇదియే మా వంశము అల్లూరు విడుచుటకు ప్రాతిపదికము.

కాలాంతరమున ఆంధ్రులలో కీర్తి, ప్రముఖత సంపాదించిన గుడివాడ తాలూకా చెన్నూరు కాపురస్థులు రెంటాల వెంకట సుబ్బారావు పంతులు, బి. యె., బి. యల్. గారు శ్రీరాములుగారు గుడివాడలో నుపాధ్యాయులుగా నున్న కాలములో వారికి శిష్యుడు. ఇంగ్లీషు నభ్యసించుచుండెను. శ్రీరాములుగారు తాను చిన్ననాడు బందరులో నోబిల్ పాఠశాలలో నేర్చుకున్న స్వల్పాంగ్లేయభాషను మరచినది మరవగా మిగిలిన దానిని పునః అభివృద్ధి చేయసాగిరి. పై రెంటాల వెంకట సుబ్బారావుగారు మున్నగువారు నేర్చుచున్న ఇంగ్లీషును శ్రీరాములుగారు వారివలన నింటివద్ద నేర్చుకొనసాగిరి. శ్రీరాములుగారి ఇంగ్లీషు భాషాభ్యసన ప్రారంభ మిప్పుడే యని చెప్పవలెను. మేధావి, గ్రహణశక్తిగలవాడు గనుక త్వరలో నందుకొని పోవువాడు. ఇట్లు 1872-73 లలోను 74 లో కొంతకూడ గుడివాడలో నుండి తరువాత అదే తాలూకాలో బందరునకు 11 మైళ్ళ దూరమున నున్న కవుతరమునకు ఆ గ్రామస్థుల కోరికమీద ఉపాధ్యాయవృత్తిమీదనే వెళ్ళిరి. అచ్చట నొక సంవత్సరము రమారమి యుండిరి. అప్పుడే భావ సంవత్సరము 1874లో నాల్గవ కుమారుడు గోవింద రావుగారి జననము. ఇదే కాలములో శ్రీరాములుగారు వేదాచల మాహాత్మ్యము, కృష్ణార్జున సమరము అను రెండు ప్రౌఢప్రబంధములు వ్రాసిరి. అందలి పద్యములు నాకు యుక్తవయస్సు వచ్చువరకు అప్పుడప్పుడు మా నాయనగారు చదువుచు వచ్చెడివారు. వాని వ్రాతప్రతులను గూడ నేను చూచుచుండెడివాడను. ప్రథమ కావ్యములగుటచేత నవి సంస్కృత సమాస భూయిష్ఠముగాను, పూర్వ సాంప్రదాయానుసారముగాను నుండెను. ఆ గ్రంథము లిప్పుడు గానరావు. శ్రీరాములుగారు పండిత గోష్ఠితో కాలము గడుపువారు. ఎవరిదగ్గర నే గొప్పయున్నను, దానిని గ్రహించుచుండిరి. 1876 ఈశ్వర సంవత్సరమున అచ్చటి కమ్మ ప్రముఖులచే నాహ్వానింపబడి, గుడివాడ తాలూకాలో చేరినట్టి బందరునకు సుమారు రెన్మిదిమైళ్ళదూరములోనున్నదోకిపఱ్ఱుగ్రామమున బ్రవేశించి యక్కడ నొక పాఠశాల నేర్పరచిరి. పెక్కండ్రు విద్యార్థులు చేరిరి. వీరిలో చాల వరకు కమ్మవారుగా నుండిరి. అప్పుడా దోకిపఱ్ఱున నొకఉదారకస్తుకులీనుడుపోలవరపుహనుమయ్యగారను వారుండిరి. వీరికేమి, ఆ యూరి కమ్మవారికేమి, వారి సంఘములో విద్యావ్యాపకమును చేసిన వారగుటచేత శ్రీరాములుగారి యెడల మిగుల భక్తి, మిగుల విశ్వాసము. శ్రీరాములుగారా గ్రామమున 1878 ఏప్రియలు మాసము వరకుండిరి. పాఠశాలవలన సంవత్సరమునకు సుమారు రు. 1500 వరకు గడించుచుండిరి. ఈ కాలముననే తెనుగు ఇంగ్లీషు జనరలు టెస్టులను పరీక్షలలోను తెనుగులో ప్లీడరు పరీక్షలోను ఉత్తీర్ణులైరి. ఈయన దోకిపఱ్ఱులో నున్నప్పుడే 1876 సంవత్సరము అక్టోబరులో వారి అయిదవ కుమారుడైన నా - విష్ణురావు - జన్మము. ఈ కాలమున శ్రీరాములుగారు సంవరణోపాఖ్యానమను గ్రంథమును లక్షణావిలాసమను నొక యక్షగాన రూపకమును రచించిరి.

సంపరణోపాఖ్యానమును నేను చూడలేదు గాని లక్షణానిలాసమును చాలవారులు ఆసక్తితోను, వినోదముతోను చదివెడివాడను. లక్షణావిలాసము లోని చాకలివన్నె నను గురించిన యొక సీసపద్యభాగము నాకు జ్ఞాపకము. అదియేదనిన – బోయిమై పల్లకీల్మో యగా కాయలెక్కిన బుజాల్గలుగువాడు. వెనవేల్మషాల్మ వేయగా వేయగా చట్టులెక్కిన యరచేతిపట్టువాడు... డంబుమీరిన పిల్లిగడ్డంబువాడు.

శ్రీరాములుగారు యౌదార్యము, పట్టుదల, విద్యాభిమానముల కుదాహరణ. సూరి సీతారామశాస్త్రి యను వైయాకరణి పిన్నవయస్కుడు ధనార్థియై శ్రీరాములు గారియొద్దకు రాగా ఆయువకుని నాదరించి తన యింట నుంచుకొని, యన్నవస్త్రముల నిచ్చి ఇంగ్లీషుభాషను గఱపి, తెలుగు ప్లీడరీ పరీక్షకు తయారుచేసి యాయన ప్లీడరీ పరిక్షలో కృతార్థులగునట్లు చేసెను.

1878 వ సంవత్సరములో దోకిపఱ్ఱు విడిచి, న్యాయవాదవృత్తికై బందరు చేరవలసి వచ్చెను. దోకిపఱ్ఱు విడుచునప్పుడు వీరియందు తమకు గల భక్తి విశ్వాసముల ప్రకటించుటకు ఆయూరి కమ్మవారు వీరిని వెండి పువ్వులచే పాదపూజ చేసి, బంగారు పూలచే శిరస్సునుపూజించి, తామే మోసి పల్లకిలో వీరి నూరేగించి అమితముగా గౌరవించినారు. ఆ మేనా నవారిని తరువాతబందరులో న్యాయవాదిగానున్నప్పుడు వీరుపయోగించి కోర్టునకు బోవుచుండిరి. ఇంతటితో వీరి ఉపాధ్యాయవృత్తి ముగిసెను. వీరు గుడివాడ, కవుతరము, దోకిపఱ్ఱులలో అతిగౌరవముగా అతి సమర్థతతో నెఱపిన విద్యాబోధన అద్వితీయము.

ఇట్లు 1878 సంవత్సరము ఏప్రియలులో అనగా బహుధాన్య సంవత్సర చైత్రమాస ప్రాంతమున న్యాయవాదవృత్తికై బందరు శ్రీరాములుగారు ప్రవేశించిరి. ఇప్పటికి వీరికి అయిదుగురు కుమారులు. తమ వృత్తి ప్రథమదినములలో ఈయన మశూచి గ్రస్తుడాయెను. అంతట మశూచికములోనే అల్లూరునకు స్వగృహమునకు గొంపోబడెను. అక్కడ స్వస్థులయినారు. ఇదేసమయములో శ్రీరాములుగారికి ఆరవ కుమారుడైన మధుసూదనరావు జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ నాడు పుట్టెను. అందరు ఆరోగ్యవంతులైన వెనుక బందరులో శ్రీరాములుగారు తిరిగి ప్రవేశించి తన వృత్తిని అవిచ్ఛిన్నముగా సాగింప బొడగిరి. వృత్తిని దీక్షతో, శక్తితో, సామర్థ్యముతో నిర్వహించిరి

శ్రీరాములుగారు ఊపిరాడక ప్లీడరువృత్తిని నిర్వహించుచున్నప్పటికి, సాంఘిక, మతవిషయములలోను, సాహిత్య సంబంధ విషయములలోను కృషిచేయుచునే యుండిరి. బందరు గొడుగుపేటలో నున్నప్పుడే ఇంగ్లీషు క్రిమినలు హైయ్యరు, సివిలు హైయ్యరు పరీక్షలలో భాషాంతరీకరించు పరీక్షలో నుత్తీర్ణులైరి. ఇంగ్లీషుప్లీడరు గాగలిగినారు. వీ రేపరీక్షకు చదివినను సులభముగా విషయములను సాధ్యమగువరకు పద్యములలో నిమిడ్చి జ్ఞాపకముంచుకొనుచుండిరి. ఇదేసమయములో అసల్ప జల్పితా కల్ప కల్పవల్లి యను నొక పుస్తకరూపమైన మాసపత్రికను సాంఘిక, మతవిషయములనుగూర్చి కొంతకాలము అచ్చు వేయించి ప్రకటించుచుండిరి. కీ. శే. రా. కందుకూరి వీరేశలింగముగారు ఇంచుమించిదేకాలమున తమ విధవావివాహోద్యమ వ్యాప్తికై ఆంధ్రదేశమున పర్యటనమొనరించిరి. శ్రీరాములుగా రప్పటిలో కొన్ని నాళ్ళు విధవావివాహపక్షమును, కొన్నిదినములు ప్రతిపక్షమును అవలంబించియుండిరి.

ఈ కాలములోనే శ్రీరాములుగారి మొదటి కుమారుడు కేశవరావుగారి వివాహము 1880 జూలై నెలలో జరిగెను. ఇప్పటి గుంటూరుజిల్లా తెనాలి తాలూకా– అప్పటి కృష్ణాజిల్లా రేపల్లెతాలూకాలో– చేరినట్టి కొండముది కాపురస్థులు అప్పుడు బొంబాయి ప్రెసిడెన్సీ ధార్వాడ జిల్లాలో తహస్సీల్దారు పదవిలో నుండిన– కొండముది రామచంద్రరావుగారి ప్రథమ పుత్రికను కేశవరావుగారికిచ్చి బాపట్లలో వివాహము చేసిరి.

1881 సంవత్సరములో శ్రీరాములుగారికి కనిష్ఠ సంతానమైన కూతురు శారదాంబ కలిగెను. 1882లో

బందరు నిజాముపేటలో నొక పెద్ద మేడను కొని దానిని బాగుగా సంస్కరించి యందులో శ్రీరాములు గారు ప్రవేశించిరి బందరును వదలి ఏలూరునకు వచ్చువరకు అ మేడలోనే కాపురము చేయుచుండిరి. ఈ మేడలో నుండగానే మోటుపల్లి రాఘవయ్య మున్నగు స్నేహితుల ప్రేరణమున ప్రతిజ్ఞపట్టి వారము దినములలో "అభినవ గద్య ప్రబంధము" అను నొక చిత్రకల్పనాకథను వ్రాసిరి. పద్యమునగాక గద్యలో నుండుటతప్ప తక్కినవిషయములన్నిటి యందును పెద్ద ప్రబంధరీతిని విరచింపబడెను. ఈ రచనాకాలమున శ్రీరాములుగారి ప్లీడరీ ప్రాక్టీసు అమితముగా నుండెను. అట్లుండియు కార్యదీక్షచే నీ పుస్తకమును ఏడు దినములలో వ్రాయగలిగిరి. సుమారీదినములలో శ్రీరాములుగారు స్టీమరుపైన మదరాసు వెళ్ళినారు.

1883 సంవత్సరములో శ్రీరాములుగారు ఫస్టు గ్రేడు ప్లీడరు పరీక్షకు- రెండవగ్రేడు ప్లీడరుపని వత్తిడి చేయుచున్న దినములలో- చదివి 1884 సంవత్సరము జనవరిలో జరిగిన పరీక్షకు రాజమండ్రి వెళ్ళి పరీక్షనిచ్చి వచ్చినారు. ఫస్టుగ్రేడుపరీక్షలో శ్రీరాములు గారు ప్యాసైరి శ్రీరాములుగారి అదృష్టవశాత్తు ఆ సంవత్సరము జూలైనుండి కడలూరులో నదివరకున్న సబు కోర్టును ఏలూరునకు మార్చినట్లును, 1894జూలై 1 వ తేదినుండి ఏలూరులో పని జరుపుననియు తెలిసి, శ్రీరాములుగా రాకోర్టులో నుండుటకు యోచించి ఏలూరు సందర్భములేమో తెలుసుకొనుటకుగాను ఏలూరునకు వెళ్ళిరి. అక్కడిసందర్భములు అనుకూల ముగా నుండునని భావించి బందరునకు రాకయే అక్కడనే కొందరి స్నేహితులను సంపాదించుకొని మునసబుకోర్టులో పెద్దవ్యాజ్యములు దాఖలుచేయసాగిరి.

శ్రీరాములుగారి ప్రాక్టీసు వృద్ధియగుచున్నది. జమీందారులు పలువురు వీరియొద్దనే తమ కోర్టు వ్యాజ్యముల నిచ్చుచుండిరి. బొమ్మదేవరవారి ఆస్థాన గ్రామమయిన తోట్లవల్లూరులోని వేణుగోపాలస్వామి కంకితముగా శ్రీరాములు గారెన్నియో కృతులు, జావళీలు, పదములు, స్వరజతులు జెప్పినారు. ఈ జావళీలు పదములు కొన్ని సంవత్సరముల క్రిందటి వరకు ఈ ప్రాంతపు వేశ్యలు పాడుచుండిరి. శ్రీరాములుగారు 1889వ సంవత్సరము ప్రారంభములో స్వగృహనిర్మాణారంభము చేసిరి. కాని నిర్మాణ మధ్యమున ఆ సంవత్సరం మార్చి 8వ తేదీన తండ్రి గారు అగు కన్నయ్యగారు గతించిరి కాని గృహ నిర్మాణ మాగలేదు. ఈ యిల్లు ఏలూరులో కడు ప్రాముఖ్యమయిన ప్రదేశములో ఒక తోటమధ్యలో కాలువగట్టున విశాలప్రదేశములో నుండి ఒకపెద్దమంచి నీరుగల బావిని గలిగి యుండుటచేత మిక్కిలిప్రసిద్ధి కెక్కినది. గాంధీ నేషనలు స్కూలువారికి విక్రయింప బడినది. గాంధీనేషనలు స్కూలు ఇప్పుడు అచ్చటనే నెలకొల్పబడియున్నది.

1887 వ సంవత్సరములో విక్టోరియా చక్రవర్తిని గోల్డెన్ జూబిలీ యుత్సవములు జరిగినప్పుడు ఏలూరు లోని యువజన సంఘము నద్వర్యమున శ్రీరాములు గారే యుత్సాహముతో నుత్సవము నిర్వహించిరి. ఆ సందర్భమున విక్టోరియారాణి రాజ్యపాలన విషయమై కొన్ని చక్కని పద్యములను కీర్తనలను శ్రీరాములు గారు వ్రాసిరి.

1888 వ సంవత్సరమున మార్చి, ఏప్రియల్ నెలలలో శ్రీరాములుగారు ఒకవిధమయిన బీజజాడ్యము వలన బాధపడిరి గాని దైవ కృపవలన మాడభూషి వేంకటాచార్యులవారి సహాయమున నెమ్మదించినది.... 1887 సంవత్సరములో గుంటూరులో జరిగిన నాల్గవ కుమారుని వివాహసందర్భమున, ఆ పట్టణముననున్న తెల్లవారికొక విందు బెట్టిరి. ఆ కాలములో ఇట్లు హిందువులు తెల్లవారికి విందు లొనర్చుట మృగ్యము. ఈ విషయము శ్రీరాములు గారి హృదయవైశాల్యమునకును, కీర్తిసమార్జనాభిలాషకును నుదాహరణము.

1884 జూలయిలో ఏలూరునకు వచ్చినతరువాత లౌక్యవ్యాపారములో నిమగ్నుడై ఇతర వ్యావృత్తుల కవకాశములేని హేతువుచే గ్రంథరచన బాహుళ్యముగా చేయలేదు. అప్పుడప్పుడు ఏకొలది పద్యములో, జావళీలో, కృతులో, పదములో మాత్రము చేయుచూ వచ్చిరి. ఈకాలములో అనేకులు అనేకవిద్యలలో ఆరితేరిన మహాపండితులు శ్రీరాములుగారి దర్శనము చేయుచు వారివలన సన్మానింపబడుచూ వచ్చిరి. పండితుల సహాయమున ననేక శాస్త్రములలోని మర్మములు గ్రహించి జ్ఞానాభివృద్ధి చేసుకొనుచునే యుండిరి. తన లౌక్యవృత్తికి నావశ్యకమగుటచేత నేమి, యితరసందర్భములవలననేమి ధర్మశాస్త్రము లను క్షుణ్ణముగా చదువుట తటస్థించినది. ధర్మశాస్త్ర పరిచయవిషయమున నొకటి రెండు కథలను చెప్పక తీరదు. వానినిబట్టి వీరి ధైర్యగుణమును, కార్యదీక్షయు ప్రకటితమగును. 1891 సంవత్సరమున ఏలూరున కనతి దూరముననున్న పేంపాడు అను గ్రామమున గుంటూరు భానుమూర్తి యను నొక వైదిక పురుషుడు ఉండెను. ఒకవిషయమున నీతనిని వెలివేయగా లౌకిక జ్ఞానపరుడైన గుండు సుబ్రహ్మణ్యం చైనులుగారి సహాయముతో, వారి యాజ్ఞికములో శ్రీరాములు గారి లౌక్యయాజమాన్యములో ఉదారపురుషుల ధనసహాయముతో నిండు పరిషన్మధ్యమున ప్రాయశ్చిత్తకర్మ నిర్విఘ్నముగాజరిగినది. శ్రీరాములు గారింటనే బ్రాహ్మణసమారాధన జరిగినది. శ్రీ గుంటూరు భానుమూర్తి భార్యాసమేతముగా అవుపోసనము వడ్డించగా, పరిషన్మమస్కారముచేయగా సుమా రొక మూడువందలమంది తృప్తిగా భోజనముచేసినారు. భానుమూర్తికి వెలి తీరినది. ఏలూరులోను, తత్పరిసరగ్రామములలోను పెద్ద యలజడి బయలు దేరినది. ఏలూరు వైదికులుగాని, చుట్టుప్రక్కల గ్రామ వైదికులుగాని, ఏలూరు లౌక్యులిండ్లకువచ్చుట మానిరి. వైదిక నియోగ కక్షలేర్పడినవి. ధర్మశాస్త్ర సభలు కూడినవి. ఈ సభలకు ప్రాయశ్చిత్తాభిముఖుల పక్షమున శ్రీరాములుగారు నాయకుడు. విముఖుల పక్షమున జంధ్యాల గౌరీనాథశాస్త్రులువారు నాయకుడు. జంధ్యాల గౌరీనాథశాస్త్రిలుగారు రేపల్లె తాలూకా కొల్లూరు కాపురస్తుడు. మంచి గీర్వాణభాషాపండితుడు. శాస్త్రములుగూడ జదివినవాడు. ఆంగ్లమున బి. ఏ. ప్యాసుచేసి ఫస్టుగ్రేడు ప్లీడరయి, అంతకుగొన్నాళ్ళకు ముందే ఏలూరునకు న్యాయవాదియై వచ్చి ఏలూరు సబు కోర్టులో వృత్తి నారంభించి వృద్ధియగుచున్నాడు. మంచి పక్ష. మంచి తర్కము. శ్రీరాములుగారును అంతవాడే. పైపెచ్చు అనుభవశాలి. ఇట్లు వీరిసాయ కత్వమున ధర్మశాస్త్రచర్చ జరిగెను. ఈ సభలలో నాలుగు వేదములును, పదునెనిమిది స్మృతులను వైదిక స్మార్తాచారములును వైదిక కర్మలతో సంబంధించిన మరి ఇతరగ్రంథములును క్షుణ్ణముగా నుభయపక్షముల పక్షమున చర్చింపబడెను. ఆ సందర్భములో శ్రీరాములుగారువాదములన్నిటిని క్రోడీకరించి "పతితసంసర్గి ప్రాయశ్చిత్త విషయకోపన్యాసమును" అచ్చులో సుమారు 70 పుటలకు మించిన గ్రంథమును రెండు రాత్రులలో వ్రాసి ముగించినారు.

సుమారిదే సమయములో "ఆచారనిరుక్తి" "దురాచారపిశాచభంజని" యను రెండు ధర్మశాస్త్ర విషయక వ్యాసములు శ్రీరాములుగారు వ్రాసినారు. కొన్ని దినముల తరువాత రండాముండన ఖండనమను నొక వ్యాసమును విధవల ముండనము ధర్మశాస్త్ర విరుద్ధమనియు అట్టి యాచారము క్రూరమైనదనియు ముండనము చేయుట తప్పనియు నిరూపించి ప్రకటించినారు.

1893 - 94 - 95 ప్రాంతముల మన దేశములో వైశ్యులకు పురాణోక్త కర్మయే కాని వేదోక్తకర్మ పనికిరాదనియు నొక సంచలనము పుట్టినది. ఈ సమయములో శ్రీరాములుగారికిని ఒక స్వాములవారికిని వాదమేర్పడినందున స్వాములవారు అర్థరాత్రమున బందరువిడిచి పోయిరట. ఈ విషయమైన వాదనలను ధర్మశాస్త్రమును హైకోర్టు తీర్పులను క్రోడీకరించి వైశ్యధర్మ దీపిక యను పెద్దగ్రంధమును శ్రీరాములు గారు రచించిరి.

1890 ప్రాంతముననో 1891 ననో ఏలూరులో పోలీసు షరీకు వలన దొంగతనములు మెండవగా అట్టి దుండగీడుల నిరోధించుటకై డి॥ మ్యాజిస్ట్రేటు పద్దకును, డి॥సూపరింటెండెంటు పద్దకును శ్రీరాములు గారు నాయకుడుగానుండి యొక రాయబారముపోగా అధికారులు విమర్శించి యేలూరులో పోలీసులందరిని ఏకమ్మున బదలాయించిరి.

1890 ప్రాంతములో బళ్ళారిలోనున్న సరస వినోదినీ సభవారు ధర్మవరము కృష్ణమాచార్యులవారి నాయకత్వముక్రింద క్రొత్తపక్కని మదరాసులో నాటకములాడుచుండిరి. ఈసందర్భములో శ్రీరాములు గారు జానకీపరిణయమను నాటకమును పద్య గీతము లతో ఆంధ్రీకరించిరి. మరియు మనోలక్ష్మీవిలాస మనునొకస్వతంత్రనాటకమును అదేపక్కీలో రచించిరి. ఈ మనోలక్ష్మీవిలాసము ప్రబోధచంద్రోదయము వలెనుండును. ఈ నాటకమును రంగస్థలముపై శ్రీరాములు గారాడించిరి.

శ్రీరాములుగారు ఏలూరులో నున్నంతకాలము విద్యాగోష్టులు, సంగీతసభలు సతతము వారింటనే జరుగుచుండెడివి. శ్రీరాములుగారు కళాప్రియుడు. సంగీత శాస్త్రమునందభిరుచియేగాక భరతశాస్త్రము నందు వీరికి ప్రవీణతకలదు. "అభినయదర్పణమను" నొక గ్రంథమును రచించిరి. స్వయముగా అభినయము పట్ట నేర్చియుండిరి. అభినయము చూపించెడువారు. వేశ్యామేళములలోనికి వీరు వెళ్లుట తటస్థించినయెడల వేశ్యలు ఆడుటకు భయపడుచుండిరి. భరతశాస్త్ర ప్రవీణురాండ్రయిన చదలవాడ పిన్నాయి, చక్రధర రావుతల్లి - పినపాల భవాని - గుంటూరులోని వేశ్య, చెదలవాడ రాజరత్నము మున్నగు ప్రవీణులయిన భరతశాస్త్రజ్ఞానులు శ్రీరాములగారియెదుట నభినయించి పేరొందినవారే.

వీరు యేలూరులో ప్లీడరీచేయుచున్న సమయములో వీరి దర్శనముచేసి వీరివలన సన్మానము బొందిన పండితులును, కవులను, గాయకులను, కళావంతులను యెంచివ్రాయచూచుట ఒక విధముగా నక్షత్రగణనమే యగును.

శ్రీరాములుగారి విద్యాభిమానముకును నౌదార్యము కును దర్పణములుగానుండు ఒకటి రెండు ముఖ్యాంశ ముల చెప్పుట మిక్కిలి యావశ్యకము. 1886 సం॥లో బసవరాజ రామబ్రహ్మముగారను నొకమధ్యవయస్కుడు ఆంగ్లేయభాషాప్రవీణుడు ఏలూరు మిడిలిస్కూలులో నుపాధ్యాయుడుగానుండి యన్యాయముగా ఆ స్కూలు సంఘమువారివలన నుద్యోగమునుండి తొలగింపబడి నిరాధారుడుగానుండి శ్రీరాములుగారి నాశ్రయించగా వారివిద్యాబోధ నైపుణ్యమును శీలమును ఆంగ్లేయ విద్యాప్రవీణతయు నిరాధారతయు గనిపెట్టి రామ బ్రహ్మముగారికి నాధారముగల్పించి వారిని ప్రోత్సాహ పరచుట యోగ్యమని తలచి ధైర్యముతో నూతనముగా శ్రీరాములుగారు హిందూ పేట్రియాటిక్ స్కూలును స్థాపించ యందులో రామబ్రహ్మముగారిని ప్రధానో పాధ్యాయునిగా నియమించిరి.

శ్రీరాములుగారు సహజముగా సంగీతప్రియుడగుట చేతను, ఆప్రాంతముల గానవిద్య అధోదశలో నున్నందునను దానినుద్ధరించుటకును గాయకుల ప్రోత్సాహముచేయుటకును ఏలూరులో నొకసంగీత పాఠశాలను శ్రీరాములుగారు నెలకొల్పినారు.

షుమారు ఏబది సంవత్సరము నాడు మనదేశమున స్త్రీవిద్య యెట్టిదశలో యున్నదియు, స్త్రీల స్థితి యెట్లున్నదియు నేను వేరుగ చెప్పనక్కరలేదు. అప్పుడు స్త్రీలు చదువుట మహాపాపముగ నెన్నబడు చుండె. స్త్రీలు సంగీతముపాడుట సంగతి యింకేమి చెప్పను? సంగీతముపాడు స్త్రీని వేశ్యతోసమానముగ నెన్నుచుండిన కాలమది. ఇట్టిస్థితులలో శ్రీరాములు గారు స్త్రీవిద్య యత్యావశ్యకమనియు సంగీతము పాడుటకు పురుషులకంటే స్త్రీలే తగినవారనియు, ఈ రెండును ఎంతమాత్రము దూష్యములుగావనియు నమ్మి ఈరెండింటికి ప్రోత్సాహమొనర్చుటలో తన యేదేండ్ల కుమార్తె శారదాంబకు సంగీత సాహిత్యములురెండును

నేర్పింప ప్రారంభించిరి. లోకనిందను ఎంతమాత్రము లక్ష్యముచేయలేదు.

1892 సం॥లో వీరి కవితాశైలిని పండితలోకమున కెఱుకపరచినట్టి తెనుగునాడను నొక చిన్నపుస్తకమును రచించిరి. దీనికే ఆంధ్రవీధియను నామాంతరము గలదు. తెనుగుదేశములోని వివిధకులముల వర్తనముల వర్ణించుటయొక్క యుద్దేశముతో నీగ్రంథము మొదలిడబడినది. కాని బ్రాహ్మణప్రశంసలో నిలిచిపోయినది.

దీనినిగూర్చి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలుగారు, శ్రీరాములుగారి దేవీ భాగవతమున కుపోద్ఘాతము వ్రాయుచు ప్రశంసించినారు. 1894 'జయ సంవత్సరమున' చక్కట్లదండ యను యొక సీస శతకమును అచ్చతెనుగున వ్రాసిరి. 'అనిపలుకు దాసురాముడిట్లచ్చ తెనుగు కచ్చమందమునింద చక్కట్లదండ' అని దాని మకుటము. ఇయ్యది యొక లౌకికనీతిమాల. మంచి సామెతల జనసామాన్యమైన యుపమానములతో నీతులనువ్రాసినారు. ఇదేకాలములో విగ్రహారాధనాతారావళి యనునొక యరువదియేడు సీసములుగల పొత్తమును విగ్రహారాధనావశ్యకతనుగూర్చి 'చిత్తశుద్ధిసాధనంబగు విగ్రహారాధనంబు' అనుమకుటముతో వ్రాసిరి. 1897 సం॥ జరిగిన విక్టోరియా చక్రవర్తిని డైమండుజూబిలీ సందర్భమున ఆమె పరిపాలనలోని సాంఘిక, శాస్త్రీయ పరిణామములను వివరించుచు 'అన్నుల సుపాణి విక్టోరియారాణి' 'నిత్య నిరుపమ కల్యాణి సత్యవాణి' యను మకుటములతో 32 సీసపద్యములను విక్టోరియా ద్వాత్రింశతి' యను పేరుతో వ్రాసిరి. శ్రీరాములుగారు 1895 వరకు ఘనముగా ప్లీడరువృత్తి చేయుచు శమకుమారులలో అప్పటికి బి.యల్. పట్టాలు పుచ్చుకున్న రెండవ మూడవ కుమారులను కోర్టులో ప్రాక్టీసున ప్రవేశపెట్టి తాము 49 వ ఏటనే వృత్తిని విసర్జించిరి. వృత్తివిసర్జనము చేసినతరువాత విశ్రాంతిని ఆయన వృధా చేయలేదు లాభమో నష్టమో ఏదో యొక విధముగా కాలమును సద్వినియోగము చేయుస్వభావము ఘంఘమునకు దేశమునకు ఉపయోగకరములైన కార్యములలో ప్రవేశింపనుద్దేశించిరి. ప్రజాస్వేచ్ఛను కోరినవారు సంఘములోని లోపములను గుర్తెరిగినవారు గావున రాజకీయ సాంఘిక విషయములలో కొంతకాలము గడపిన లాభముండునని యెంచిరి. 1895, 96 సంవత్సరములలో ఈ విషయమై కొంత ప్రయత్నించిరి. నేషనలు కాంగ్రెసుకు సహకారులుగా 1896 సం॥లో గోదావరిజిల్లా రాజకీయసాంఘిక సభలు రాజమండ్రిలో జరిగినప్పుడు ఆ రెండుసభలలోనువీరు పాల్గొన్నారు. సహజవాగ్ధాటితో కొన్ని విషయములలో గంభీరోపన్యాసములు చేసినారు. తరువాత సంవత్సరపు సభలనేలూరునకు ఆహ్వానముచేయుచు శ్రీరాములుగారు చేసిన సరసహాస్య ఉపన్యాసము సభవారికి మిక్కిలి యాహ్లాదము కలిగించినది.

అప్పుడు మైసూరుప్రజల కోరికపై మైసూరు రంగాచారి హాలులో నొక గంభీరోపన్యాసమును గావించి మెప్పులవడసిరి. జనసామాన్యమునకు అందులో పల్లెటూరిప్రజలకు నచ్చునట్లు ఉపన్యసించు మహాశక్తి, భాష శ్రీరాములుగారికున్నట్లు ఇతరులకు లేదు. ఎక్కడకు వోయినను ఆయన జనుల ప్రేమను గౌరవమును సమ్మానములను పొందుచుండిరి. ముఖ్యముగా స్త్రీ విద్యనుగూర్చి యుపన్యసించుచుండిరి. పల్లెటూళ్ళలోకూడా కొన్నిచోట్ల వీరి యుపన్యాస ఫలితముగా బాలికాపాఠశాలలు నెలకొల్పబడినవి. గ్రామములలో నిశాసీదారులుండకూడదని వీరియూహ. అంగలూరు, గురజ మొదలైన 'పెద్ద పల్లెటూళ్ళలో స్త్రీవిద్య గరపుటారంభమైనది. జనసామాన్యములో త్రాగుడు జూదము మొదలగునవి యుండకూడదని కొన్ని కీర్తనలను వారు స్వయముగారచించి పల్లెటూళ్ళ సభలలో వినోదముగాపాడి, బోధించుచు వచ్చినారు. వారి కవితాశక్తి యీ యుపన్యాసములలో మిక్కిలి యుపయుక్తముగా నుండెడిది. ఒకప్పుడు మద్దెల తాళములతో హరికథారూపమునగూడ బోధ చేయుచుండెడివారు. 1900 సం॥ము విజయనగరమున హరికథారూపమున సాంఘికవిషయములుపన్యసించిరి. 1897లో జరిగిన విశాఖపట్టణ సభలకు శ్రీరాములు

గారు ఆహ్వానింపబడిరి. కాని వెళ్ళినట్లులేదు. ఉయ్యూరులోజరిగిన కృష్ణాజిల్లా సభలలో రాజకీయ సభకు కీ॥ శే॥ గంజాం వెంకటరత్నంపంతులుగారును సాంఘికసభకు శ్రీరాములుగారును అధ్యక్షులుగా నుండిరి. 1898 సం॥న గుంటూరులో జిల్లాసభలు జరిగెను. రెండుసభలకు రఘుపతి వెంకటరత్నంగారు అధ్యక్షులు. ఈ సభలలో శ్రీరాములుగారొనర్చిన యుపన్యాసములనుగూర్చి శ్రీ రాయసం వెంకటశివుడు ఎం. ఏ. ఎల్, టి., గారు ఆంధ్రపత్రికలో నిల్లు వ్రాసిరి.

"శ్రీరాములుగారు చనిపోవకపూర్వము ఒకటిన్నర సంవత్సరము క్రితమువరకు ఇట్టి మత సంఘ రాజకీయ సాహిత్యవిషయమైన సభలలో పెక్కింటిలో పాల్గొని గంభీరమైన యుపన్యాసములిచ్చుచునే యుండిరి."శ్రీరాములుగారినిగూర్చి శ్రీరాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారిట్లనిరి. "తమను నేనిదివరకెరుగను. మా నాయనగారు శ్రీరాములుగారిపేరు వారి యుత్కృష్ట కవిత్వమువలన దిగంతవ్యాప్తమైనదనిరి."

1905, 1906 సం॥లలో బంగాళాదేశములోప్రబలిన స్వదేశీయ రాజకీయోద్యమ ప్రచారకులుగా బిపిన్ చంద్రపాలుగారు ఆంధ్రదేశమున పర్యటనము చేయుచు బెజవాడకు రావటం తటస్థించినది. ఆస్వదేశీ యుద్యమమును దొరతనమువారు అణగదొక్కవలెనని గూడ ప్రయత్నము సలిపిరి. ఆ యుద్యమానుచరులే ప్రస్తుతము కృష్ణాపత్రిక యధికారి ముట్నూరి కృష్ణారావుగారు. పాలుగారు బెజవాడలో నుపన్యసించవలెనని ప్రారంభించునపుడు సభకు అధ్యక్షులు గానుండుటకచటి పెద్దలు భయముచేత తటపటాయించి చెవులు కొఱుకుకొనుచుండగా అప్పుడాసభలో శ్రీరాములుగారుండుటచూచి కొందరుయువకులుఉత్సాహవంతులు శ్రీరాములుగారిని అధ్యక్షతవహించవలసినదని కోర్గా ఆయన ఉత్సాహముతో అంగీకరించుటయేగాక తమ గంభీరోపన్యాసమునిచ్చి సభను యుక్తరీతిని నడిపించినారు.

శ్రీరాములుగారికి విద్యార్థులపైన మిగులప్రేమ. వారెందరకో ధనసహాయము అన్నదానముచేసిరి. 1901 ప్రాంతమున వారుకార్యాంతరమున మదరాసులో నుండినపుడు **Northern Circars Progressive Union** అను సంఘమువారి వార్షికోత్సవముజరిగినది. అది సాధారణముగా **University Convocation** జరిగినవెంటనే జరిగెడిది. ఆ యుత్సవములో నుపన్యసించిరి. ఆ సంఘమువారు శ్రీరాములుగారిని కోరగా వారు ఆంధ్రభాషావిషయమును విద్యార్థిధర్మములను బోధించుచు ఆశువున హృదయములగు పద్యముల నిమిడ్చి గొప్ప యుపన్యాసమిచ్చి సభికులనలరించిరి. క్షత్రియుల వ్యాజ్యసందర్భమున చెన్నపట్టణములో నున్నపుడు తీరికగానున్నందున శ్రీరాములుగారు శాకుంతలము, రత్నావళి, ముద్రారాక్షసము, మహావీరచరిత్ర, మాలతీ మధుకరీయ, కురంగగౌరీశంకర ఉత్తరరామ చరిత్రలను తెనిగించిరి. ఇందులో శాకుంతలము అచ్చతెనుగున తెనిగించిరి

1899 సంవత్సరము రెండవ అర్థమున నైజాము రాష్ట్రములో ముఖ్యముగా వరంగల్లు జిల్లాలో కొన్ని మత విషయ వివాదములువచ్చి వీరిని ఆహ్వానించగా వెళ్ళిరి. ఆ తరుణమునకూడ కొన్ని మాసములుండిరి. ఆ సమయమున మతవిషయముపై ఉపన్యాసములిచ్చి వివాదముపరిష్కరించుటయేగాక సాంఘిక విషయముల గూడఉపన్యాసరూపముగా బోధించుచువచ్చిరి. ఇదేసమయములో పింగళి వెంకటరామారెడ్డిగారు మొదలగు ఆ ప్రాంతపు నాయకులను గొందరిని దర్శించి వారిచే సన్మానముపొందిరి. ఆయన నైజాములో నుండగా కొమార్తె శారదాంబ తన 19 వ ఏట ప్రసవమై 26-12-1899తేదీన చనిపోయినది. ఈ మరణము వీరు ధైర్యముతో భరించి 1900 సం॥లో దేవీభాగవతమును రచింపనారభించిరి. దేవీ భాగవతముయొక్క రెండవ ముద్రణమునకు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు రచించిన పీఠికలో దాని ప్రాశస్త్యము నుగ్గడించిరి. దేవీ భాగవతమున కథారంభమునందు శ్రీరాములుగారు తమ స్వగ్రామమైన అల్లూరుగ్రామమును వర్ణించినారు.

దేవీ భాగవతము ఆయన రచనలలో తుదిదియని చెప్ప వచ్చును. అది చాలా పెద్ద గ్రంథమైనందువల్లను వాణీప్రెస్‌లో సర్కారు పనులు హెచ్చుగాను ఇంకను చాల ఇతరత్ర ముద్రించవలసివచ్చి ఆలస్యమైనది. చివరిభాగము వాణీప్రెస్‌లోనే ముద్రించి 1907 నాటికి ప్రకటించబడినది. శ్రీరాములుగారు అది ప్రకటింప బడిన తరువాత 1908 మేనెలలో దివంగతులైనారు.

1901 సంవత్సరమునకు సరియగుప్లవసంవత్సరము లోవచ్చిన అధికమాసము ఆషాఢమా, శ్రావణమా అను సందేహముకల్గి తెలుగు సిద్ధాంతుల మహా సభను రాజమహేంద్రవరమున జరిపిరి. ఆ సభలో రాజ మహేంద్రవర కాలేజీలో గణిత శాస్త్రలెక్చరరును భారతీయ హైందవ జ్యోతిశ్శాస్త్రవేత్తలునైన తంజా వూరు కాపురస్తులు టాగట్ వెంకటసుబ్బారావుగారు, విశాఖపట్టణ కాపురస్తులు తరువాత మైసూరు సంస్కృతోన్నత పాఠశాలలో సిద్ధాంతోపన్యాసకులు కీ॥ శే॥ తాండవ కృష్ణమాచార్యులువారును శ్రీరాములు గారును అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. సభలో వాదోప వాదములు జరిగినవి. ఈ దిక్కు సుబ్బారావుగారును శ్రీరాములుగారును శ్రావణ మధికమాసమని నిర్ణ యించిరి. తాండవకృష్ణమాచార్యులుగారుఆషాఢమనిరి. ఇరువురధ్యక్షుల తీర్మానప్రకారము శ్రావణమని నిర్ణ యింపబడినది. శ్రీరాములుగారికి జ్యోతిష విజ్ఞానము చిన్ననాటినుండి అలవడియుండెను. రానురాను దాని నభివృద్ధిచేయుచు వచ్చిరి. ఈ సభలో వారధ్యక్షులుగ నెన్నుకొనబడుట వలననే వారికా విద్యయందు గల ప్రతిభ తెలియవచ్చినది.

శ్రీ వీరేశలింగ దంపతులు వితంతువివాహము చేసికొన్న గోగులపాటి శ్రీరాములుగారి ప్రథమభార్యా పుత్రుడైన వీరేశలింగమును పెంచి విద్యాబుద్ధులు చెప్పించి ఉపనయనముచేసిరి. కాని వీరేశలింగము గారి కిష్టమైనట్లు వితంతువివాహము చేసికొనుటకి పిల్లవాడు ఇష్టపడలేదు. చెరుకుపల్లి వెంకటరత్నం గారు తమకుమార్తె నిచ్చుటకంగీకరించిరి. కుర్రవానికి శృంగేరిపీఠాధిపతుల ఆజ్ఞానుసారం బెంగుళూరులో ప్రాయశ్చిత్తము పునరుపనయనము జరుపబడెను. ఈతను ఆరువేల నియోగియగునోకాదోయని శంకించి ఆంధ్రదేశమునగల పెద్దనియోగిగృహస్థువద్దనుండి నిదర్శనపత్రము తెమ్మని నిర్బంధించ నాయువకుడు దాసు శ్రీరాములుగారివద్దకురాగ ఆయన నిదర్శన పత్రమునిచ్చిరి. అంత నా వివాహము జరిగెను.

శ్రీరాములుగారు తమయింటజరిగిన వివాహము లలో పండితసన్మానము చేస్తూండేవారు. ఒకప్పుడు మొగపెళ్ళివారు చెయ్యకపోతే తామే చేసేవారు. శ్రీరాములుగారి మనుమరాలు దుర్గాంబపెళ్ళిలో సదస్య సభలో శ్రీరాములుగారికి అగ్రతాంబూలమునిచ్చి గౌరవించిరి.

1905, 1906 లో శ్రీరాములుగారు అల్లూరులోని శ్రీ సోమేశ్వరస్వామి ఆలయము అదివరకు పెంకు టింటిలోనుండగా విమానముతో గోపురమునిర్మించిరి. 1906 సంవత్సరమున వీరి దేహారోగ్యముచెడినది. బెజవాడలో ఔషధసేవచేసిరి. గుంటకలగరాకు రసము తేనెతో సేవించునప్పుడు భృంగరాజమహిమ అనునొక చిన్నపద్యముల పుస్తకమురచించిరి. ఆయ నకు ఔషధములగురించి తెలియును. ఓషధులలో అభ్రకము మొదలగు వానిపుటముచేయువిద్య భస్మము చేయు విద్య తెలియును. దానిని వఝూ సూర్యనారా యణగారికి చెప్పిరి. 1908 మే 16వ తేదీన కీలకనామ సం॥ వైశాఖ శు॥ ౧౫ తేదీన శ్రీరాములుగారు దివం గతులైరి.



# శ్రీదాసు శ్రీరామకవి-కవితాప్రాశస్త్యము

## తొలి ఆస్థానకవి శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శతావధాని అభిభాషణ

ఇటీవల నన(గా నాంగ్లప్రభుత్వ మారంభమైన పిమ్మట నుద్భవించిన కవులలో నందు వించుమించుగ మానమకాలికులగు కవులలోఁ బ్రాచీన సంప్రదాయ ముగఁ గవితాసామగ్రిని సేకరించి రచనకుఁ గడంగు వారు వీరు దక్కలేరు. ఇక్కవికవిత్వము సంప్ర దాయబద్ధమగుటయేకాక మిగుల జనరంజకమును లోకానుభవవ్యంజకమును ననునంశము

## 'తెలుఁగునాఁడు'

అనుస్వతంత్ర రచనవలన దెలియ నయ్యెడిని.

ఉ॥ లేవరు "లెండు, లెం" డనిన లేచినవారయినన్ దటాలునన్
బోవరు, పోవుదు వ్నిలిచి "పోదుము పోదుము త్రోయకుండటం
చీవరు పందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్యసం
భావనవేళఁ జూడవలె బాపనసాములసాము లన్నియున్॥

ఉ॥ నమ్మిన నమ్మకున్నది నావశమా? జను లాడికొన్న వా
క్యములు నేను జెప్పెద భయంపడియో పడకో, నియోగిలో
క మ్మనివార్యకార్యఘటక మ్మవుఁగాని పరోపకారశూ
న్యమ్మను స్వప్రయోజనపరాయణమున్ దలపోయ విద్ధరన్॥

పై పద్యములవలన రసజ్ఞులగువా రిక్కవిధార యెంత మనోహరమో గుఱితింపఁగలరు. మచ్చునకు రెండుమాత్రమే చూపితిని గాని యాపొత్తము నెఱిఁగినవారు దాని నిందునంపూర్ణముగా నేల యుదాహరింపలే దని నాయెడఁ గినియునంతటిస్థితిలోఁ దద్రచన యుండుననుట నిక్కువము. అంతదనుక నెందులకు? ఈగ్రంథము మొట్టమొదటఁ గొన్నిసీస పద్యములు వ్రాయఁబడియున్నవి. ఆరచనగూడ బైసందర్భమును సమర్థించుటకు మిక్కిలి తోడ్పడఁ గలదు, తిలకింపుడు.

సీ॥ ఎలయెండ చెట్లసందులనుండి గోడలఁ దవిలి తా విలువుటద్దములు గాఁగ
గొనగొనఁ జనునింద్రగోపసంఘాతంబు వందిళ్ళలోఁ జిన్నిపగడములుగ
చూరుపట్టియలఁ బిచ్చుకదంపతులచాలు చెక్కి తీర్చినయట్టిచిత్రములుగ
దూలాలగూళ్ళ సందులనుండి వెడలి మ్రోఁగెడి తుమ్మెదలమ్రోఁత గీతములుగ

తే. గీ. కెరలి వాఁకిళ్ళఁ దూసిఁగతెరలు మూఁగి
నెరబుచేదారుఁ గెంబట్టుపొరపసందు
సన్నయుల్లడగాఁగ నాషాఢలక్ష్మి
పగిదిఁదనరారు నల్లూరు పల్లెటూరు॥ ౧

ఇదే మకుటము గలపద్యములు మఱికొన్నిగలవు. అన్నియు రసస్ఫోరకములుగను స్వభావోక్తిపోషకము లుగను నుండును. చదువరులు తిలకింపఁగలరని దిఙ్మాత్ర ముదాహరించి విడిచితిని. ఇక్కవి రచించిన కబ్బములు పెక్కులు. అన్నిటిలో నాకెక్కుడు రుచించునది తెలుఁగునాఁడు, రెండవది ప్రస్తుత గ్రంథము. యావద్విషయములం గాకయున్నను

గవితకు సంబంధించిన కొన్నియంశముల నియ్యనఘుఁడు రెండవశ్రీనాథుఁ డేమో యని నాకుం దోఁచెడిని. శ్రీనాథుఁడు

"గురుకులక్లిష్టో మురారిః కవిః"

అనుతెగలోనివాఁడు, ఈయనయో? సహజపాండిత్యుఁడు పైఁగా. భాగవతము నాంధ్రీకరించిన ధన్యుఁడు. కావున మన మీకవివతంసుని శ్రీపోతరాజునకుఁ బ్రతినిధిగా సమ్మానింతము.

"ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః"

అను కాళిదాసోక్తి యిట్టి సహజపాండితీ ధురంధరులే లేనియెడల వ్యర్థకోశము కావలయును. ఈ శ్రీరామమంత్రి యేలూరికోర్టులోఁ బ్రధానన్యాయవాదిగా నుండుకాలములో మేము తాడేపల్లిగూడెము సమీపమునందలి కడియెద్దగ్రామమున బ్ర॥శ్రీ॥ వర్ల బ్రహ్మయ్యశాస్త్రులవారియొద్ద విద్యార్థులముగా నుండుటచే నప్పుడప్పుడు వీరిని సందర్శించి వీరితో విద్యాగోష్ఠి చేఁగాలము గడుపుచు వీరిగృహమునఁ గొన్నినాళ్లుండుట తటస్థించుచుండెడిది. అప్పటి యీయనవ్యాసంగమున్ దిలకించినచో నియ్యనఘునకుఁ బ్రధానజీవనోపాధి యగులౌకికవ్యాపారముకన్నఁ గవితారచనాదీక్షయే ముఖ్యమని తెలిసికోఁగలిగితిమి, కావున నీ యన

"ఇదం బ్రాహ్మ మిదం క్షాత్రం శాపాదపి శరాదపి"

అనుదాని కుదాహరణ మనుటకుఁగూడఁ గొందొక వెనుదీయవలసినదె; విద్యావిషయముననేకాక రూపసంపదయెడలఁగూడ నిక్కవి వర్ణనీయుఁడు; ఎక్కడనో గాని యిట్టియుభయసామానాధికరణ్యము లగింపదు. కావుననే

"విద్యారూపం విరూపాణామ్"

అని యభియుక్తులు నొడివిరి. గ్రంథవిస్తర మెందులకు?

శ్లో॥ వశ్యా సుసుతా విత్తకరీచ విద్యా, నిరోగతా
సజ్జనసంగతిశ్చ
ఇష్టాచ భార్యా వశవర్తినీచ, దుఃఖస్య
మూలోద్ధరణాని పంచ॥

అను శ్లోకమునందలి యదృష్టములెల్ల నిమ్మహాకవికి సంఘటించినందులకు నాకు నాశ్చర్యము గలుగుచుండును. కవులును నుండవచ్చును. పండితులును నుండవచ్చును. ఐశ్వర్యవంతులును నుండవచ్చును. కాని దాసు శ్రీరామకవివంటి ధన్యులు కోటి కొకరేని జేకూరుట యరుదు. కావున నీయన సర్వవిధముల ధన్యుఁడు. ఇక్కవి సహజపాండిత్య విషయముననే కాక భాగవతాంధ్రీకరణప్రసక్తియందుఁగూడఁ బోతరాజుగారే; ఆయన భాగవతము నెట్లు పెంచెనో యీయనగూడ నట్లె చాలచోట్ల స్వకపోలకల్పితమగు కల్పనలచే గ్రంథమును బెంచియున్నారు. ఈవిషయము సంస్కృతాంధ్రగ్రంథములను రెంటిని విమర్శనాబుద్ధితోఁదిలకించువారికి సుగమ మని యెంచి గ్రంథవిస్తరభీతిచే నే నప్పనికిఁ బూనలేదు. మఱియు

ఆ॥ వె॥ భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు,
శూలికైనఁ దమ్మిచూలికైన॥

అని శ్రీమద్భాగవతాంధ్రీకరణప్రస్తావనమందుఁ బోతరాజుగారు వాక్రుచ్చియున్నారు. ప్రస్తుతమగు దేవీభాగవతముగూడఁ గొన్నిఘట్టములయం దాభాగవతమునకుఁ దీసిపోవునది కాదు. ఇందు మంత్రయోగ వేదాంతాదిశాస్త్రరహస్యములు పెక్కులు గలవు. ఇందెన్నియోచోట్లు పునరుక్తివదాభాసములుగలవు: ఆయీఘట్టములయందు వ్యాఖ్యాన ముపకరించుననుకొంద మన్నను నయ్యదిగూడఁ గొన్నిచోట్ల మూకీభావమునే వహించుచున్నది. మనప్రస్తుతగ్రంథకర్త సర్వమును మూలముమీఁదనే యన్వయించుకొని యాంధ్రీకరించినట్లును వ్యాఖ్యానమును బొత్తిగా మూచూడనియట్లును దెలిసికొనుటకు మన కిందుఁ గొన్నియాధారములు కనుపట్టుచున్నవి. అందొకటి మాత్రముదాహరించి చర్చించి చూపుచున్నాను.

"దూఱు లేదు సతికి జారుచే ననుచును, విప్రునకును వేదవిధులవలన"
(ప్రథమస్కంధము)

పై పద్యభాగము

కూడా ఆ రీతిగానే వున్నవి. చదువరులు శ్రద్ధగా పరికింతురుగాక. వంశవర్ణనలో తలిదండ్రులను గూర్చి రచించిన స్వభావోక్త సీసం చదివి తీరవలసిందే.

సీ॥ కన్నయ్య పండింపఁ గామమ్మ వండింప లేచిన
విస్తళ్ళు లెక్కలేదు.
కన్నయ్య తెప్పింపగామమ్మ యిప్పింప గొలచిన
ధాన్యంబు విలువలేదు
కన్నయ్య నిలిపింప గామమ్మ గొవిపింప
వేల్పుగొల్పుల కొక్కవేళలేదు
కన్నయ్య వ్రాయింప గామమ్మచేయింప
నుపకారములకు మీరొడ్డులేదు

తే. గీ. నన్నునుంబోలె నాదుమేనల్లు కొడుకు
లైన కనకయ్య కృష్ణయ్య నరసి ప్రోచి
పెంచి పెద్దల గావించి పెండ్లి చేసి
నట్టి నా తల్లిదండ్రుల నాత్మ దలతు.

ఆ పుణ్యదంపతులకిట్టి మహానుభావుఁ డుదయించుట యుక్తమే. ఈ శ్రీరామకవిగారుకూడా పూర్వుల పోలికగానే గార్హస్థ్యమును జరుపుకున్నారు. ఈయన కొమాళ్ళలో నారాయణరావుగారు ద్వితీయులు. ఈయన ఆంగ్లభాషలో కృషిచేసినవారేగాని తండ్రిగారివలె కవితావ్యాసంగంకూడాచేసి కొన్ని పొత్తములు రచించినవారని నేనెఱుగుదును. ఈయన కొమారులలో మాత్రమేకాదు - కవిత స్త్రీ సంతానమునందుఁగూడా ప్రవేశించి యీ మహాకవికి మహానందాన్ని పెంపొందించింది. కవిత్వంలో కొడుకులందరికి ప్రవేశం లేకపోయినా విద్యావిషయంలో అందరూ ప్రాజ్ఞులే. వీరి సంతానంలో విద్యావిషయములో కొంత తగ్గుగా చెప్పఁదగ్గవారు జ్యేష్ఠపుత్రులు కేశవరావుగారే, కాని ప్రయోజకత్వంలోమాత్రం కేశవరావుగారు "పుత్రాదిచ్ఛేత్పరాజయమ్" అనే మహాగౌరవాన్ని తండ్రిగారికి కల్గించినారని లోకమెఱిఁగినవిషయమే. ఇది విషయాంతరం. మనం ప్రస్తుతం ముఖ్యంగా ముచ్చటించుకోతగ్గది కవిత్వంకదా? నేనింతకుముందుదాహరించిన సీసపాదంలో- "లేచిన విస్తళ్లు లెక్కలేదు" అనే వాక్యాన్ని కొంచెం విమర్శించి చూపుతాను. ఈ స్థలంలో రసజ్ఞత్వం లేనివారు చేసే శంకలు యీ విధంగా వుంటాయి. విస్తళ్ళు లేవడ మేమిటి? విస్తరిలో నిండుగా పదార్థం వుంటే విస్తరి లేవదు కదా? కనుక వారి అన్నదానం (అర్థాకలిగా పెట్టేఁ దని ధ్వనిస్తూవుంది) వర్ణనీయంకాదని వొకశంక. ఇంతేకాదు విస్తరి అచేతనం - కనుక లేవటం తటస్థించదని యింకొక శంక. విస్తళ్ళు 'లెక్కలేదు' అనేచోట క్రియాకారకాన్వయం యేలాగ? విస్తళ్ళుబహువచనం కనుక క్రియాపదం బహువచనంలోనే (లేవు)వుండాలి అని మరొకశంక. ఈలాటి శంకలుచేసేవారినిగూర్చి శ్రీనాథుడుచక్కఁగా వ్యాఖ్యానించి వున్నాడు.

శా. హంసీయానకు......ప్రధ్వంసాభావము ప్రాగభావమనుచున్ దర్కింతు రెక్కాలమున్. చూ)

ఆయనకంటె అధికంగా వారిని మనం గౌరవించఁజాలం. కనుక ఆమహాకవికి నమోవాకాలు సమర్పించి ప్రకృత ముపక్రమింతుముగాక. అయితే శ్రీనాథుడు వర్ణించిన వర్ణన శుష్కతార్కికులకు సంబంధించినది. వారికి కవిత్వ స్వారస్యంతెలియక పోవచ్చును. గాని శాస్త్రంలో ప్రజ్ఞలేకపోలేదు. వారుసూత్రాలను వ్యాఖ్యానించినట్టు కవిత్వాన్నివ్యాఖ్యానించడానికి వుపక్రమిస్తే లోకజ్ఞానంలేని వారి పాండిత్యాన్నిచూచి శ్రీనాథుఁడు పైవిధంగా మందలించాఁడు. ఇప్పుడు శంకించేశంకలు శాస్త్రప్రజ్ఞ వున్నవీకావు. కవిత్వానుభవం (ఏదో రచన సాఁగించినంతలో అనుభవం వున్నట్టుకాదు) వున్నవీ కావు. నన్నడిగితే పై మాదిరి శంకలు చేసేవారికి మాత్రమే కవిత్వరసజ్ఞత్వం లేదని చెప్పి వూరుకొనేదిలేదు.

"దశపూర్వేషాం దశాపరేషామ్"

అని చెపుతాను. "తేభ్యో మహాద్భ్యో నమః" శ్రీరామకవిగారు సంస్కృతంలోకూడా నిశితమైన సాహిత్యం కలవారే ఐనను కవిత్వాన్ని తత్సమపదభూయిష్ఠంగా నడిపించక తఱచు తెలుఁగు పదాలతోనూ తత్తుల్యంగా వుండే తత్సమ పదాలతోనూ

నడిపిస్తున్నారు. (ఆ॥వె॥ తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగు. చూ.) కొంచెం మచ్చుచూపుతాను.

ఉ॥ తాఁకిన తాఁకునం బడి వితాకున బంప్లికిలించి
రక్కసుల్
మూఁకలు మూఁకలై పఱవ ముట్టి నక్రకచాళి
గిరినన్
వాఁకలు గట్టి నెత్తురులు వాఱ "గుయో? మొఱో!"
యంచు వేదనన్
గేకలువెట్ట నాత్మఁ బరికించి వడిన్ దనుజేంద్రుఁ
డుగ్రుఁడై. (పంచమ స్కంధము)

సంస్కృత పదజటిలంగా వుండే రచనకూడా కొంచెం చూపితేనేకాని చదువరులకు తృప్తికలుగదు.

సీ॥ గరుదంచదురుమరుద్గతపటాపటపటాపటుతా
పతితపాదపవ్రజంబు

................

తే॥గీ॥...పోషణంబగు తార్క్ష్య విభూషణంబు
(సంస్కృతంబు పచరించిన పట్టున భారతీవధూటీ.చూ)

దీన్ని నేను వెదకి వెదకి వుదహరింపలేను. ఎక్కడపడితే అక్కడ యిట్టి సంస్కృతపద జటిలాలు దొరుకుతాయి. అట్టి తెలుఁగు పదాలవీ దొరుకుతాయి. మారుమూలపదాలు యేరి కూర్చడం కొందఱు కవులకు పరిపాటి, కొందఱు అలా కాక సమయానికి స్ఫురించిన పదాలతోనే రచన సాఁగిస్తారు. నాకు అలాటి రచనే హృదయంగమంగా కనపడుతుంది. మాఱుమూల పదాలు యేరియేరి కూర్చిన రచనను గూర్చి మొల్ల

"మూకఁ చెవిటివారి ముచ్చటదియు"

అనేసింది. కవి తన భావాన్ని యెంత సులభ శైలిలో వివరిస్తే అంత శ్లాఘ్యుఁడు. శ్రీరామకవిగారు చాలాచోట్ల మూలాన్ని అతిక్రమించి కొంత స్వంతంగా రచిస్తూ వచ్చారు:

తే. గీ॥ నిప్పు దా జొన్నచొప్పయు నీరవతియు
గడ్డి యముఁడు తవుదు పెద్దగాలి చిట్టు
సూర్యచంద్రులు గుగ్గిళ్ళు చూడ నాకు
నమలివేయనె గడియలో నమరపతిని.

బహుశః పై పద్యంలోవున్న మేటరు మూలంలో లేదనే నాకు జ్ఞాపకం. మహిషాసురుఁడు కదా! వాఁడు వానికి భక్ష్యమైన పదార్థాలుగా శత్రువులను వాఁడు వక్కాణించుట మూలంలో లేకపోయినా అనువాదకులు గ్రహించుటలో తప్పేమి? —

శ్లో॥ అవసరపతితా వాణీ గుణగణరహితాఽపి శోభతే॥

కదా? దిఙ్మాత్ర ముదాహరించితిని. ఇట్టి స్వకపోల కల్పనలు ప్రతిస్కంధమునందు వున్నవి.

షష్ఠస్కంధంలో హైహయులు పురోహితులను ధనలోభంచేత పీడించిన ఘట్టం యీవత్తూ కవిగారి స్వకపోల కల్పితమే. పోతరాజుగారు శ్రీకృష్ణుని బాల్యచేష్టలు వర్ణించినట్లే ఈ ఘట్టంలో శ్రీరాములుగారు కల్పించినారు. ప్రకృతం యింకొక పద్యం వుదహరిస్తాను.

ఆ॥ వె. చేతి దండమేమి చేయు నీ పట్టున,
నెక్కనట్టి దున్న నెచటఁ దోలఁ?
గాలుదున్న లిన్ని కడలెల్ల గ్రమ్మెను
దాఁటగలనె యంచు ధర్ముఁ డేడ్చె."

ఈ పద్యంలోవున్న మేటరుకూడా మూలంలో వున్నట్టు నాకు జ్ఞాపకంలేదు. మా తెలిగింపు యిప్పటికి దాదాపు యేభైయేళ్ళనాఁటిది. మళ్ళా సంస్కృతాన్ని చూస్తేనేకాని యేమాటా రూఢిగా చెప్పలేను. కాని తరచుగా స్వకపోలకల్పితాలువుండడంవల్ల యిదికూడా అలాటిదే అనుకున్నాను. చదువరులు పరిశీలింతురుగాక. ఈ మహిషాసుర యుద్ధఘట్టంలో యింకా యిలాటివి చాలా వున్నాయి. వీట్లని మూలాతిక్రమణంగా సహృదయుఁడెవ్వఁడూ భావించడు.

ఉ॥ ఒక్క యెడన్ సమానముగ నొక్కొక్కచోట
విశేషరీతిగా

నొక్కెడఁ దగ్గగా మఱియు నొక్కెడ వేఱొకరీతి దోఁపగాఁ

జక్కఁగఁ జేసి రెల్ల కవిసత్తములు.

(శ్రీనివాస విలాసం-చూ)

ఈయన కవిత్వంలోవున్న విశేషాలు చాలా వ్రాయ వలసివున్నా వార్థక్యదోషంచే యేర్పడ్డ శక్తి లోపం అడ్డుతగిలింది. ఈయన సాక్షాత్తూ శ్రీనాథుని అవ తారమే అంటే ప్రతి చెప్పేవారుండరని నా విశ్వాసం. శ్రీనాథునికంటే కూడా యీయనజీవితం మిక్కిలి ధన్యం. కవి గృహస్థులలో నిట్టి యదృష్టాలు పట్టిన వారు మృగ్యులనికాని, అసలే లేరనికాని నిస్సంశ యంగ చెప్పవచ్చు. ఇతరకవులతోకంటే నాకు యిమ్మహాకవితో చుట్టరికం కొంత సన్నిహితం. దేవీ భాగవతాంధ్రీకరణ కవులలో నేనుగూడ నొకడను గదా? అందుచే మేము సోదరప్రాయులం. అన్యోన్యం గురవోవిప్రాః-

శ్లో॥ కవిః కరోతికావ్యాని లాలయత్యుత్తమోజనః
తరుః ప్రసూతే పుష్పాణి మరుద్వహతి సౌరభమ్"

గ్రంథకర్త "తనమార్గం యిట్టిది. నేను వీలయి నంతలో భాషకుపుండే అనావశ్యకపు సంకెళ్ళను తొలగించడానికే ప్రయత్నిస్తానుగాని మఱికొన్ని సంకెళ్ళు తగిలించడానికి ప్రయత్నించేదిలేదు. నా జోలికి మీరెవరూ రావద్దు" అని కంఠోక్తిగా చెప్ప డానికి తాత్పర్యం విచారిస్తే తేలే సారాంశమేమిటంటే? చాలామందికి- "సూదిబెజ్జమంత నోరూ, ఆకాశమంత ఆకలి" అన్నట్టు ప్రజ్ఞతక్కువా, ప్రతిష్ఠాకామిత్వం యెక్కువగానూ వుంది ఆతరగతివారు తదర్థమై కొంత వ్యర్థమైన కోలాహలం చేస్తూవుంటారనిన్నీ అట్టివారికి జవాబులు వ్రాస్తూ నాకాలాన్ని వ్యర్థపుచ్చేది లేదనిన్నీ పక్కాణించినట్టు తేలుతుంది. అంతేకాని నేను లక్షణ విరుద్ధంగా రచనసాగిస్తాను, నాయిష్టం నాది, నన్నడగడానికి మీరెవ్వరు అనేదికాదు. అందు చేతనేకదా? యెందఱో మహాకవులను అధార్టీచూప వలసివచ్చింది. ఏ కవిగాని తన కవిత్వాన్ని-

ఉ॥ ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పినభారతంబులో,
నది రచింపఁగాఁ వడియె...

అన్నకవి రాక్షసుఁడుగారి నియమాన్ని పాటించినట్లు లేదు.

ఉ॥ కాలముబట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి దేశభాషా
లతాంగి మాఱుటది సత్కవి సమ్మతమౌట నన్యదే
శ్యాలును నాంధ్రభాషఁగలవౌటను నౌచితి బట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మది పండితు లేగతి నొప్పకుందురో

(పాణి గ్రహీత. ౨౦-౧౯)

అన్నమాదిరిగానే రచన సాఁగించినట్లు కనపడుతుంది. ఎవరి దాఁకానో యెందుకు ? తిక్కన్న శంభుదాసులు కూడా పై నియమాన్ని అంతోయింతో (ప్రాయతిన్నా కంపే, గడ్డతిన్నాకంపేగదా,) అతిక్రమించినవారే. అంటే యిఁక శ్రీనాథాదులనుగూర్చి చెప్పవలసి వుంటుందా? యీరహస్యాన్ని యెఱిఁగిన ప్రతికవిన్నీ తనకాలంనాటికి ప్రపంచంలో కలిగిన మార్పులలో యుక్తమైన వాటిని (ఫిడేళ్లు, రైళ్లు, బాంబులు, ప్యారచూట్లు వగైరా) తన కవిత్వంలో శబ్దవిషయం లోనూఅర్థ విషయంలోనూ పరిగ్రహించడంలో లేశమూ దోషంకాదని శ్రీరాములుగారి తాత్పర్యమైనట్లువ్యంగ్య మర్యాదచేత స్పష్టంగా గోచరిస్తూవుంది. ఇదియే లోకా దరాన్ని పొందవలసిన కవికి అనుసరణీయమని నేనను కుంటాను. కాదు, కవిరాక్షసుఁడుగారి శాసనప్రకారమే మేము నడుస్తామంటారా (వట్టిమాటలేకాని క్రియ శూన్యమే) మిమ్మెవళ్ళు వద్దంటారు? మీరు ఆలాగే నడవండి అనేదే జవాబు. శ్రీరామకవిగారి రోజులకు అప్పుడే పాశ్చాత్య భాషావ్యాప్తి మనదేశంలో కొంత కలిగింది. ఆకారణంచేత తెలుఁగు కవులలో చాల మందికి తమ కవిత్వాన్ని పండితులద్వారా సంస్క రించుకోవలసిన అవస్థ ఘటించింది. ఈ దురవస్థ శ్రీరామకవిగారికి ఘటింపలేదు. అందులో ఈ భాగవత

రచన నాఁటికి అట్టిప్రసక్తికి బొత్తిగా అవకాశంలేదు. మూలాన్ని యీయన వ్యాఖ్యానాపేక్ష లేకుండానే సమన్వయించుకున్నారు. ఈయన విద్వత్కవి.

శ్లో॥ "విద్వత్కవయః కవయః కేవలకవయస్తు
కేవలం కవయః"

నామతంలో కేవల కవిగూడా సమ్మాన్యుడే, నేను ప్రధానంగా చూచేది రసమే. అది లేని పద్ధతిని అపాకం "స్వహస్తపాకమే". యీయన సరసకవి. విద్వత్కవి, స్వతంత్రకవి. ఆశుకవి, దాత, నేత, ఇన్ని యోగాలు పట్టినవారు యేకాలంలోనూ కవులలో మృగ్యులే. షష్ఠస్కంధంలోని స్వకపోలకల్పిత భాగం పురోహితులను వెక్కిరించినట్లు కనపడుతుందిగాని అది బుద్ధిపూర్వకం కాదని నే ననుకుంటాను. సహృదయాః ప్రమాణమ్.

---

( ఇది 'సరస్వతీ సామ్రాజ్యమ్' అను అయ్యంకి వేంకటరమణయ్యగారి సన్మానసంచికనుండి గ్రహింపబడినది)



# దేవీభాగవత ప్రాశస్త్యము

కవి సామ్రాట్ — విశ్వనాధ సత్యనారాయణ

ఇది శ్రీ దాసు శ్రీరామపండితులచే విరచింపబడిన దేవీ భాగవతము. వీరికి పూర్వమే దేవీ భాగవతమును ములుగు పాపయారాధ్యులవారు విరచించిరి. తిరుపతి వెంకటేశ్వరులును దేవీభాగవతమును రచించిరి. తిరుపతి వెంకటేశ్వరకవుల రచనయు వీరి రచనయు ఇంచుమించుగా సమకాలమునందే జెరిగినదని చెప్పవచ్చును. శివభక్తియులగు పాపయారాధ్యులవారు, వీరిద్దరి రచనలకంటె వంద యేండ్లకు పూర్వమే, వారి గ్రంథమును విరచించిరి. ఈ సంగతి ఈ గ్రంథముననే, మొదటి రెండు పద్యములలో ప్రత్యేకముగా శ్రీ దాసు శ్రీరామ పండితులచే చెప్పబడినది. ములుగు పాపయారాధ్యుల వారి గ్రంథము సుమారు నలుబది యేండ్ల క్రింద ముద్రితమై, పండితులకు పంచిపెట్టబడినది. విజయవాడలోనే కీర్తిశేషులు ఆలయ నిర్మాతలు, ధనవంతులు శ్రీ శరభయ్యగారు మొదలైనవారు ఆపని చేసిరి. ఆ గ్రంథమును నేను చూచితిని.

ఇది యిట్లుండగా నా చిన్నప్పుడు శ్రీ తిరుపతి వెంకటేశ్వరులలో నొకరైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారివద్ద నేను స్కూల్ఫైనలు చదువుచుండగా శ్రీ దాసు శ్రీరామకవిగారి చాటు పద్యములు మిక్కిలి ప్రచారములో నుండెడివి. వారికిని, మా గురువుగారికిని మిక్కిలి స్నేహము. మా గురువుగారు చిన్న చిన్న గ్రంథములు వ్రాసి, దేవీభాగవతమును గూడ వ్రాసిరి. కవిత్రయము భారతమునువలె, భాస్కరుడు రామాయణమునువలె, పోతన్నగారు భాగవతమును వలె, ఒకగొప్ప పురాణమును తెనిగించినగాని యాంధ్ర సాహిత్యములో తమ పేరు శాశ్వతముగా నుండదని పూర్వకవు లనుకొనుచుండెడివారు. అందుచేత మా గురువులు దేవీభాగవతమును వ్రాసిరి. కాని వారితో సమానముగా వారి సమకాలికులైన దాసు శ్రీరాములు గారుకూడ వ్రాసిరన్న విషయము మాకు చిన్నప్పుడే తెలియుటయు, విద్యార్థులమై యుండగా మేము శ్రీ దాసు శ్రీరాములుగారు వ్రాసిన యీ దేవీ భాగవతమును కొన్నికొన్నిచోట్ల చదివి యానందించుటయు చిన్నప్పటి మా కవితా సాధనలో వీరి గ్రంథము కూడ నొకటి యగుటయు మాకు బాగుగా జ్ఞాపకమున్నది. వీరి గ్రంథము మరల చదువవలయునని రెండుమూడు మారులు ప్రయత్నించితిని. నాకు లభ్యము కాలేదు. ములుగు వారి గ్రంథమే ఎవరో కొద్ది దినములు నావద్ద నుంచుటచేత క్వాచిత్కముగా చూడగల్గితిని.

ఇప్పుడు వీరి గ్రంథమును అందందు చూచుట తటస్థించినది. ఈ గ్రంథములో గడుసుపోకడలెన్నో కలవు. సమకాలికులయు, పూర్వులయొక్క యామార్గములు సమృద్ధిగాకలవు. తెలుగుపలుకుబళ్ళు పెక్కులు గలవు. పలుచోట్ల ప్రౌఢరచనగలదు. సప్తమస్కంథములో దేవీస్తోత్రములో కొన్నిపద్యముల పంచపాదులు, దీర్ఘసమాస భూయిష్ఠములు వీరి రచనాప్రౌఢిని తెలుపును. నవమస్కంథములో 'కృష్ణాభక్తకల్పద్రుమా' అన్న మకుటముతోడి యొకశతకమే కలదు. పూర్వపురాణములలో నిట్టివిలేవు. వీరు విడిగా కృష్ణశతకమువ్రాసి యిది పాడుపోవుటయెందులకని తమ దేవీభాగవతమున చొప్పించియుండవచ్చును. మఱియు కొన్నిచోట్ల వీరిరచన చాల విచిత్రముగా నున్నది. ద్వాదశస్కంథములో అమ్మవారి అనగా గాయత్రీదేవియొక్క సహస్రనామములు పూర్తిగా పేర్కొనబడినవి.

పురాణములు చదివి వానిలోనున్న విషయముల భాగవతాదులలో లేనివి తెలిసికొనుటకీ గ్రంథము మిక్కిలి ఉపయోగపడును. భూగోళ, ఖగోళవిషయముల క్రతువులస్వరూపము, ఉపనిషత్తులలోని రహస్యములు మొదలైనవెన్నోకలవు. స్వారోచిష చక్షుషవైవస్వతమను చరిత్రములుగలవు. ఇతర పురాణములలోలేని కొన్ని విశేష విషయము లిందు సులభముగా తెలిసికొనవచ్చును. ఇందు భారతకథ యున్నది. అన్నికథలు కలవు. ఒక్కొక్క కథ యొక్కొక్కవిధముగా వ్రాయబడినది.

బహువృత్తములు తత్రతత్ర గ్రహింపబడి, చారుత్వమును సంపాదించుచున్నది. అందందు తెలుగు బాసలోనున్న కొన్ని శతకములలోని కొన్నిగడుసు రచనలు స్వీకరింపబడినవని చెప్పవచ్చును.

నారదుడు స్త్రీయై తులధ్వజుడను రాజుతో సంసారము చేయటం ఒక చమత్కారమైన శృంగారరసము భాసించునట్లు వ్రాయబడినది. పలుచోట్ల పలు రసములు వీలైనంతవరకు నిర్వహింపబడినవనుటలో పొల్లుమాట యేదియు లేదు.

కావ్యరచనలో శృంగార రసములో కొన్ని తెలుగు మాటలు ఎందలకొలదిగా ఉపయోగించుట పూర్వ కవుల గ్రంథములయందు కన్పించుచున్నది. ఈ గ్రంథమునందా పదము లన్నియు తత్రతత్ర వాడబడినట్లు కన్పించుచున్నది.

ఈ కవిగారియొక్క యాంధ్ర భాషాజ్ఞానము మిక్కిలి దొడ్డది. వీరి లోకానుభవము దానికంటె దొడ్డది. పూర్వ కథాభిమానము మఱియు మిక్కిలిగా నున్నది.

గ్రంథము సర్వాలంకృతమై యున్నదని చెప్పవలయును. ఈ గ్రంథము చదివినచో ఎట్టివారైనను కవులు కాక తప్పదు. రచనలోని ధారాశుద్ధి ప్రశస్త పథమున నున్నది. నవమస్కంధములో 251, 252, 253 పద్యములు చదివినచో నేను చెప్పిన శృంగార రసములోని తెలుగు మాటల పోహళింపు వ్యక్తమగును. ఆ పద్యములలో నున్నది భగవంతుడు వరాహమై, ప్రకృతి దేవితో సంసారము చేయుట 'ఒక్క వేలుపుల యేడు' దేవతల సంవత్సరమని యర్థము. ఇట్టి చమత్కారములు పలుచోట్ల కలవు.

మొత్తముమీద శైలి చాల సులభమైనది. ఈ మహాకావ్యము ఆంధ్ర పద్య రచనాగత మాధుర్యసౌకుమర్యగుణములకు నునికిపట్టని చెప్పవచ్చును. ఇందులో మఱియు దేవీ సంబంధములైన కథలు కలవు. అవి మిక్కిలి భక్తితో వ్రాయబడినవని చెప్పవలయును.

ఇంత పెద్ద గ్రంథములోని గుణములన్నియు పేర్కొనుట చాలా కష్టము. పీఠికయే బలిసిపోవును. దాసు శ్రీరాములుగారు ప్రసిద్ధులైన కవులు. వారి గ్రంథము జాగ్రత్తగా చదివినచో ననేకములైన తెలుగు పలుకుబళ్ళు తెలియును. ఈ గ్రంథము పునర్ముద్రితము కాబోవుచున్నదని విని యీ రెండు పంక్తులు వ్రాయుట నా విధియని తలపోసి వ్రాసితిని. పండితులు మన్నింతురుగాక.



# మహాకవి దాసు శ్రీరాములుగారి లఘుకావ్యములు

శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లు

మహాకవి దాసు శ్రీరాములుగారిని నేను చిన్న తనమునుండియు వినికిడివల్ల నెఱుంగుదును. మా నాయనగారు వీరినిగుఱించియు వీరికవితనుగుఱించియు సగౌరవముగ ప్రసంగించుచుండిరి.

తరువాత కొన్నాళ్ళకు నేను వీరి రచనలు చదివితిని. ముఖ్యముగ వీరి తెలుఁగునాడు మొదట పరిచితమైనది. అందలి పద్యములు కొన్ని మా అన్నదమ్ము లిర్వురకు కంఠతః వచ్చుచుండెను.

చదివిరా ఋగ్యజుస్సామముల్ భూర్భువ
స్సువరాదిలోకముల్ సుతులు ముట్ట

అను సీసపద్యము మాయింట బహుకాలముగా ఆలాపింపబడుచుండెడిది. మొదటినుండియు మాఅన్నగారు తెలుగు మహాకవుల మేలేర్చిన పద్యములు నోటికిఁబట్టి చదువుచుంటయు నవియెల్ల మాయింటివారెల్లరకు కంఠతః వచ్చుటయుఁ బరిపాటిగానుండెడిది. అట్లువచ్చిన పద్యరత్నములలో నిదియొకటి. తెలుగు సారస్వతములో నన్నయాది కవు లొక్కొక్క రొక్కొక్క నూతనశైలికి సృష్టికర్తలు. నన్నయ, శ్రీనాథుడు, నాచనసోముడు, తెనాలిరామకృష్ణుడు గొప్ప శైలీకర్తలు. తదితర కవితాలక్షణము లట్లుండగా నెవరి ప్రత్యేకశైలి వారికొక భూషణప్రాయము. అట్టి శైలీసంపదలేనివాడు కవివాచ్యుడు కాడని మా అన్నగారి అభిప్రాయము.

పూర్వోక్తమైన సీసపద్యమట్టి శైలీసంపద కలిగినది. దానిని శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు మొదలైన మహాకవుల పద్యములప్రక్క నిలువఁబెట్టినచో నది మొక్కపోక తన ప్రత్యేకతను నిరూపింపగల శక్తిగలది. శ్రీ దాసు శ్రీరాములుగారి రచన శక్తిగలదని నిరూపించుటకీ పద్యమొక్కటిచాలును. పండిన వాఙ్మనోవృత్తులుగలిగి చిరంతనమైన కవితాభ్యాసము చేసి యనిర్వచనీయమైన ప్రాగ్జన్మసంస్కారము గలిగిన మహాకవి నోటినుండిగాని యట్టి పద్యరత్నములు వెలువడవు.

శ్రీ దాసు శ్రీరాములుగారు ముప్పది గ్రంథములకు పైగా రచించిరి. వానిలో శ్రీ దేవీ భాగవతము ప్రధాన మల్లప్రాయము; నా కది యిష్ట గ్రంథము. నేను దానిని గుఱించి వ్రాయవలయును. దానికి దగిన సామగ్రి నే నింకను సమకూర్చుకొనలేదు. అందువల్ల నీ వ్యాసములో శ్రీ శ్రీరాములుగారి చిన్న గ్రంథములనుగూర్చి వ్రాసి తృప్తిపొందుదును.

ఒకమాట. దేవీ భాగవతము వ్రాయుటకు పూర్ణదీక్షాపరుడై యుండవలయును. శ్రీరాములుగారి కే దీక్షయు లేదని వారి మనుమలు శ్రీ పద్మనాభరావుగారన్నారట. అది ప్రామాదికమని నా తలంపు. శ్రీరాములుగారు మహా దీక్షాపరులని నేను నిస్సంశయముగ నమ్ముచున్నాను. శాక్త సంబంధమైన, తంత్ర సంబంధమైన సర్వనిగూఢ విషయములు శ్రీరాములుగారికిఁ గరతలామలకములు. దీనికి వారి దేవీ భాగవత రచనయే ప్రమాణము.

వారి యిష్ట దేవత కామేశ్వరి. ఆమె వారి యిలువేల్పు. దాసువారిది హరితస గోత్రము. మాదియు హరితస గోత్రమే. హరితస గోత్రికులకు కామేశ్వరి యిలువేల్పుగా నుండును. పెండ్లి పేరంటములలో నామెను కుటుంబములోని జీవద్దంపతు లెల్లరునుగూడి

కొల్చుచుందురు. మా గురువర్యులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారును కామేశ్వరిని గొల్చుచుండిరి. శ్రీవారి దేగోత్రమో నాకు గుర్తులేదు. వారి ఆరోగ్య కామేశ్వరి, సౌభాగ్య కామేశ్వరి శతకములు నేనెఱుంగుదును. అయితే కామేశ్వరికి ప్రత్యేకమైన మంత్ర మేదియు నా యెఱింగినంతవఱకు లేదు.

కామేశ్వరి ద్వితీయ కూటాత్మిక. కకారము మొదలు మకారము వఱకు నున్న స్పర్శాక్షరములు జాగ్రదవస్థా ప్రతీకలు. కామేశ్వరి వాని కధిష్ఠాత్రి. కా-మ=కామ+ఈశ్వరి=కామేశ్వరి. దీనికి క్లీం అనునది బీజాక్షరము. కూటత్రయము మాయా బీజముతో పర్యవసించును. క్లీం హసకహల హ్రీం - అనునది మంత్రములోని రెండవ కూటము. ఇది కామేశ్వర్యాత్మకము. పంచదశ నిత్యలలో మొదటి నిత్య, అనగా ప్రతిపత్స్వరూపిణి కామేశ్వరి - ఆమెకు దీర్ఘాంతములైన యవరలలు బిందు సహితములు బీజములు. యాదు లంతస్థములు. సుషుప్త్యాత్మకములు. కాఁగా కామేశ్వరి జాగ్రత్సుషుప్త్యవస్థలను బాలించు దేవతయని యేర్పడుచున్నది. అయినను ఆమెకు ప్రత్యేక మంత్రోపాసన లేదు. (నాకు దెలిసినంత వఱకు).

ఇంతకు శ్రీరాములుగారేమంత్రము నుపాసించిరో తెలియదనుటకే యింతపడి వ్రాసినది. "గుహ్యాతి గుహ్య గోప్త్రీత్వం" అని యున్నది. పూర్వకాలమున - ఇప్పటికిని కొందఱు ఉపాసకులు తమ యిష్టదైవత మంత్రములను బయటపెట్టెడివారు కాదు. సర్ జాన్ ఉడ్రాఫ్ పండితునివంటి పాశ్చాత్య తంత్రవిదులవల్ల ఈ శాస్త్రము కొంతవఱకు రచ్చకెక్కినది. అట్లే శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిచే ననుష్ఠితమైన మంత్రరాజమేదోకూడ దెలియదు. శ్రీ రామకృష్ణపరమహంస కాళీదేవ్యుపాసకులని మాత్రమే తెలియునుగాని వారిచే నుపాసితమైన దేవతయు, తన్మంత్రమును నెఱుకపడవు. ఇది యుపాసకుల మర్యాద. శ్రీ దాసు శ్రీరామకవిగారీ మర్యాదనే యనుసరించిరి.

ప్రకృత మనుసరామః. శ్రీ దాసు శ్రీరామకవిగారి తెలుఁగునాడు లోకోత్తరమైన గ్రంథము. ఇది పొగడిక కాదు యదార్థమైన వచనము. కవి కవిత వ్రాయును. ఆయన పద్యరచన, వ్యంగ్యముల కూర్పు, అలంకార విబంధన, భాషాసౌష్ఠవము - ఇవి విమర్శనీయాంశములే కాని యవి ప్రధానములు మట్టుకు కావు. ఈ యంశము కొందఱ కాశ్చర్యకారి కావచ్చును. కాని నేను సత్యమునే చెప్పుచుంటిని. కవితకు భాషాదులు వ్యంగరసాదులకూడ ప్రధానములుకావు మరిప్రధానమేది? ఇది గడ్డయినప్రశ్న. దీనికి సమాధానము చెప్పుట కష్టము. కావ్యమునందు సర్వత్ర ప్రతిబింబితమగుచు నెప్పటికప్పుడు నవనవోన్మేషముగా పాఠకుని కెదురగుచు, కావ్యార్థమునకెల్ల నొక నూతనవికాసము నొసంగుచు, కావ్యవస్తువునకు వెనుక దాగియుండు కవి మనోవృత్తి - కావ్యమునకు ప్రధానాంశము. అది యనుభవరూపముగా నుండును. దాని నందుకోలేని వాడు విమర్శకుడు కాదు సరికదా, సరియైన పాఠకుఁడు గూడఁగాలేఁడు.

దాసు శ్రీరామకవిగారి తెలుఁగునాడను కావ్యమున ప్రతిబింబితమగుచున్న వారి మనోవృత్తి మేలిమి బంగారువంటిది. నిశితమైన పరిశీలనము, సరసమైన హాస్యము, గంటుచేయని తెగడిక వీరి మానసికౌదార్య గుణమునకు ప్రతిబింబములుగా నలరారుచున్నది. తెనుఁగుసాహిత్యములో హాస్యరసప్రధానములైన కావ్యములు మృగ్యములని యభియోగముకలదు. ఆ యభియోగము తెలుఁగునాడుతోఁదీరిపోయినది. ఇది యొకవిధముగా ఎడిసన్ వ్రాసిన **Spectator** వంటి కావ్యము. సంస్కృతమున దీనింబోలినది విశ్వగుణాదర్శచంపువు- హాస్యరసనిర్వహణము చాల దుస్సాధ్యమైన విషయము. **I hate not the man, I hate his faults** అను గాంధీయసిద్ధాంతము ననుసరించి తద్వ్యతిరేకముగా మనుజుని చేఁతల విమర్శింపుమనే, ఖండింపుచునే: వేళాకోళముచేయుచునే యతనినారాధింపు గంభీరమైన పక్కి, మాటపొందిక, కూర్పు పొంగుల్ని స్సీగ్రంథము నందడుగడుగునఁ బొడగట్టు

చున్నది. ఈ విషయమును లక్ష్యీకరించుటకై యీ గ్రంథమునందలి పద్యముల నన్నింటినుదాహరింప వలసియుండును. గ్రంథబాహుళ్యమునకు జంకి యీ పని చేయకుంటిని. శ్రీ దాసు శ్రీరాములుగారి విస్పష్ట పాతవృత్తి, వారి రసభరిత మైన హృదయవైశాల్యము నీ క్రిందియుక్తులలో గమనింపవచ్చును.

"వసుధ నియోగి సంధ్యయును వైదికు చేతి విడెం
బటంచునున్"

"వైదికునకు దర్పపోటు, నియోగికిఁగలముపోటు, రాజులకీటెపోటు"

మాధ్వులగురించి-

భోగినీయోగ సంభోగంబు పాటింప
దివిరి సాలగ్రామ తీర్థమాడ." అనిరి.

"స్మార్తులలో విస్తరిపొత్తె వియ్యముల పొత్తుల్లేపు
వింతయ్యేడిన్"

దాసువారు సంఘం సంస్కారులు. వీరు వైదికు లతో వియ్యములొనరించిరి. దానికి బీజము వేసినది శ్రీరాములుగారే.

"నియోగులు కుక్కగుంపు, మాధ్వులు కాకిగుంపు-
వైదికులు రాబందుల గుంపు."

"వైష్ణవ బ్రాహ్మణులదె దైవప్రతిపత్తి"

ఈ వాక్యమున వేళాకోళము, మెప్పురెండును మిళితమైయుండుట గమనార్హము.

శైవులకు దీక్షతో అమర్త్యత వచ్చును-మర్త్యత మంటపాలు, అమర్త్యత మంటిపాలు అని కవి కేరడ మాడుచున్నాడు. శైవులనుపాతిపెట్టగా వారిదేహములు మంటిపాలగును. శైవేతరులను తగుల బెట్టుటచే వారిదేహములు మంట-అగ్నిపాలగును.

ఈ గ్రంథమునఁగవిగారు కొన్ని స్వతంత్రప్రయో గములను వాడిరి - మూతురు కర్ణరంధ్రముల్ - ఇది చిన్నయసూరికి సమ్మతముకాదు-

తవైవ మమంచున్ - తవ+ఏవ+మమ+అంచున్ స్త్రీవాచక తత్సమ సంబోధనంబులమీద అకారంబునకు సంధిలేదు - మమ+అంచున్ = మమయంచున్ అని యుండదగును.

రుబ్బు గుండాకార రూధి- ఈ సమాసముచింత్యము
వియ్యపొత్తులన్ - ఇట్టి మువర్ణలోసమాసము
మూర్తికవి చేసినాడు.

పాంధబాడబులు - ఇది వైరిపదము-

శ్రీదాసు శ్రీరాములుగారిలో నొకవిధమైన తిరుగు బాటుతీవ్రత యున్నది. అది భాషా నిబంధనల విషయ ములో ప్రకటముగాఁ గానవచ్చుచుండును. దీనినిగూర్చి మఱియొకచో వివరముగా విన్నవింతును.

అభినవ గద్యప్రబంధము

ఇది శ్రీ శ్రీరామకవిగారు రచించిన యొక వచన ప్రబంధము. పుడమిలో లేనిది, అన్ని వర్ణనములు కలిగినదైన యొక కథ నేడు నాళ్ళలో వచనమున రచింపుమని యొక మిత్రుడు కోరఁగా శ్రీరాములుగారు దీనినినిర్ణీతకాలములో రచించియిచ్చిరి. ఈయనలో నొక తిరుగుబాటు దోరణి యున్నదనిపైన వ్రాసితిని. అదికేవలము తిరుగుబాటేకాదు. Challenging Temperment (సవాలుచేయు తీరు) కూడనున్నది.

సుబోధ యను పొత్తమున అచార శబ్ద నిర్వచ నము చేయుచు వీరిట్లు వ్రాసిరి. "ఇందు నా వలనఁ బొడమిన తప్పులు నాకుఁ గనబరచి పెద్దలగువారు నాకు బుద్ధిచెప్పి సవరించుకొనఁ జేసిరేని మిక్కిలి సంతోషించెదను."

ఈ మాటల పోకిమి గమనింపదగును. పెద్దలైన వారు బుద్ధి చెప్పవలయునట. స్పర్ధయా వర్ధతే విద్యా- పూర్వము మనదేశములో శాస్త్ర వాదములు జరుగు చుండెను. ఉభయ పక్షముల నుద్దండ పండితులు నిలువ బడి వాదించుచుండిరి. ఇప్పుడు పండితులు లేరు, వాద విషయములు లేవు-ఆ సంస్కారము పండిత కవులం దుండెడిది. అస్మద్గురువులు శ్రీ చెళ్ళపిళ్ళవారు ఆ కాలము లోనివారే.

ఈ సుబోధ యను పొత్తము సంస్కృతమున వ్రాయబడినది. సంస్కృతమున నిది వాక్యత్రయ మాత్రమే. అవి యివి.

౧. అథాచారం నిర్వదిష్యామి.

౨. ఆచారో ధర్మానుష్ఠితి శ్శాస్త్రే

౩. సజాతీయ క్రియాపరంపరాచరణ మితరత్ర.

ఈ వాక్యత్రయమే యీ గ్రంధ శరీరము. దీనికి శ్రీ పప్పు జగన్నాధశర్మ యనువారు తెనుగున సుబోధ యను వ్యాఖ్యానము వ్రాసిరి. దీనికి శ్రీరాములుగారే తెనుగులో నొక పీఠిక వ్రాసిరి. తాము వ్రాయబోవు దురాచార పిశాచ భంజని యను గ్రంథమున కిది యొక ప్రవేశిక యను తాత్పర్యమును వెల్లడించిరి.

ఇంతకు నీ వాక్యత్రయమందు ఆచార మనగా ధర్మానుష్ఠానమని వెల్లడించిరి. సుబోధ వ్యాఖ్యానము గూడ నట్లే వివరించినది. పరాశర స్మృతికి వ్యాఖ్యానము వ్రాసిన మాధవామాత్యులు.

"నిత్యనైమిత్తి వయో రాచార ధర్మయో రభేదస్య వివక్షి తత్వాత్" అని వ్రాసియుండుటచేతను,

మనుస్మృతి వ్యాఖ్యాతయైన కుల్లూకభట్టు, 'పుఃష ధర్మరూప ఆచారః' అని వ్రాసియుండుటవల్లను ఆచార మనగా ధర్మానుష్ఠానమే యని వివరింపఁబడినది. కాని యిది శ్రీరామకవిచే వ్రాయబడిన దురాచార పిశాచ భంజని గ్రంథమున కెట్లుపష్టంభకమైనదో మనకుఁ దెలియదు. దురాచార పిశాచ భంజని యను గ్రంథము లభ్యము కాలేదు. అది దొరికినగాని దీని మంచిచెడ్డలు విచారింప నయితి గాదు.

చెళ్ళపిళ్ళవా రన్నట్లు శ్రీరాములుగారు సరసకవి, విద్యత్కవి, స్వతంత్రకవి, ఆశుకవి, దాత, నేత. వారికి బరిచితముకాని శాస్త్రము లేదనవచ్చును. జ్యోతిశ్శాస్త్రము, వైద్యశాస్త్రము, వ్యాకరణశాస్త్రము, తర్కశాస్త్రము, తంత్ర శాస్త్రము, వేదాంత శాస్త్రము వారికిఁ గరతలామలకము లన్నట్లు తోచు చున్నది. కాని యాయన తలగట్టిన కాలము ఆంగ్లేయుల పరిపాలన కాలము పాశ్చాత్యుల విమర్శ దృష్టితో దేశీయుల యాచారములను బరిశీలించు నొక ధోరణి యానాడుండెను. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి వంటి సంఘసంస్కారులుదయించి వర్ధిల్లిన కాలమది. వంగదేశములో శ్రీ రామమోహనరాయలు, మహారాష్ట్రమున పండిత రామాబాయి వర్ధిల్లిన కాలమది. శ్రీరాములుగారు సంస్కృతాంధ్ర కర్ణాటకాంగ్ల సాహిత్యములయందు న్యాయశాస్త్రము (Law) నందు అందెవేసిన చేయి-ఆనాటి సంస్కార వాదముల ప్రభావము కొంత యాయనపైఁ బడుటలో నాశ్చర్యము లేదు ఏతద్విధమైన యావేశమున బొడమినదే దురాచార పిశాచ భంజని కావచ్చును.

ఇంతకును అభినవగద్య ప్రబంధమునుండి సుబోధ మీది కొక గంతు వేసితిమి. ఈ పొత్త మనేక విధముల నభినందనీయమై యున్నది. 'గద్యం కవీనాం నికషం వదంతి' అను నానుడి యున్నది. పద్య కవులెల్లరు గద్యము వ్రాయలేరు-వ్రాయరు. శ్రీరాములుగారి గద్యశైలి ప్రౌఢగంభీరమై చిన్నయసూరి గద్యశైలిని దలపించుచున్నది. చిన్నయసూరి శ్రీరాములుగారికి సమకాలికుడో, అర్వాచీనుఁడో-

అసలు విచిత్రమైనది వారి కథాకల్పనా శక్తి. పుడమిలో లేనిదానిని మిత్రు డడిగినాడు. అందుచేత క్రొత్త కల్పన యవసరమైనది.

అది యొకటికాదు, రెండుకథలు. అంగి, అంగము. అంగియైన కథ చిన్నది. అంగకథయే పెరిగి కావ్యము నాక్రమించినది.

పాంచాలదేశంబున నింద్రావతీ యను పట్టణము కలదు. పద్మపాదుడు దానికి రాజు వానికి భార్యలిరువురు. వారిరువురకు సంతానములేదు. దానికారాజు దిగులుపడుచుండెను. అతడొకనాడు భార్యాద్వయముతో నుద్యానవనమునకుఁ బోయెను. అందొక దేవదారువృక్షముపై కాలజ్ఞుడు దివ్యదృష్టియను పక్షి

దంపతులుగలవు. అవి రెండును రాజుయొక్క యన పత్యదోషము వావనోపు నుపాయం బెఱింగినయవి. వాని పల్కులు రాజు వినుటచే నతడు రహస్యమును కెడగొట్టునని యవి యెగిరిపోయినవి. ఇట్లుజరుగుటచే రాజు విచారపడి మంత్రుల సలహానడిగెను. మంత్రు లలో మణిమంతుడనువాడు సన్యాసివేషమును వేసికొని రాజునకు పక్షులు రహస్యముచెప్పునని తెలియజేసెను. ఈమధ్యలో మఱియొక యనపత్యదోష బాధితుడైన వాడుద్యానవనములో దొంగతనముగాఁ గాచియుండి పక్షులను గలవరపరచుటచే నవి లేచిపోవుట యొక మాఱు జరిగినది. చివరకు పక్షులు చెప్పిన రహస్య మిది-

శ్లో॥ చంద్ర భాగా నదీస్నానాత్
భవానీ పూజనా దపి
అపుత్రాః పుత్రిణ స్సంతు
జీవంతు శరదాం శతం॥

దీనికి మతిమంతుడు క్రొత్తవ్యాఖ్యానముచేసెను. చంద్రభాగలో స్నానముచేయుచు ప్రాతఃకాలమున భవాని విని మూడుదినములు పూజించినచోఁ గృత కృత్యుడవగుదువని చెప్పెను.

పై శ్లోకమునందలి యుత్తరార్థము పౌరాణికులు చదువు ఆశీర్వచనపాఠములోనిది. ఇందు 'సంతు' అను లోట్ ప్రత్యయమునకు యోగ్యత చాలదు. స్యుః అని యున్నచో యోగ్యముగా నుండెడిది. లేక లట్ ప్రయోగముచేసిన బాధయుండదు. మూడుదినము లన్నమాట మతిమంతుడుచేసిన వ్యాఖ్య శ్లోకార్థగతము కాదు.

ఇది అంగియైనకథ. దీని కంగముగా శ్రీరాములు గారు పెద్ద కథనల్లిరి. అందు బ్రాహ్మణపుత్రుడు విద్యానాథుడుపొందిన పాట్లు, వాని వలచిన నాగకన్య కనకవల్లి పొందిన యగచాట్లు, చివరకు వారిరువురు వివాహితులై యుజ్జయినిలో మంత్రిపదవినందుట- యీ మొదలైన సుఖాంతమైన చిలువలు పలువలుగా వర్ణింపఁబడినది.

మొత్తముమీద నీ ప్రబంధమునకు మూలమెందును లేదు. ఈ కల్పనాశక్తి యద్భుతావహమని యంగీక రింపక తప్పదు. ఎటులైనను విది కాశీమజిలీకథవలె నడచినదిగాని యిందు లోకోత్తరమైన సందేశ మేది యునులేదు. లేఖక పాఠకుల రచనాశ్రవణకండూతిని సమృద్ధిగా దీర్చునట్టి కథాద్వయమిది. అదియునుగాక యీ రెండు కథలకు ఆంతరంగికమైన సంబంధ మావంతయు లేదు. ఈ రెండింటికి నేదోరకముగా తాదాత్మ్యమును గల్పింతమన్నను వలనుగాకున్నది.

ఇందలి రచన లోకోత్తరమై సాలంకారమై సగుణ వృత్తిరీతియై పండితాదరణీయముగా నున్నది-

ఇక్కడ నొకమాట చెప్పవలయును. ఈ ప్రబంధ రచనాకాలము నాటికే శ్రీరాములుగారికి శక్తి పూజా పరాయణత్వము, ఘనిష్ఠమైయుండెను. పూర్వోక్తమైన శ్లోకమున భవానీ పూజనము. శుకరూపమున నున్న విద్యానాథుని వైదుష్యమును వర్ణించుపట్ల భారతీ మంత్రోపాసన నుగ్గడించుటయు దీనికి ప్రమాణములు. ఒక విధముగా దేవి భాగవత రచనకు సంబంధించిన యిచ్ఛాశక్తి యీ ప్రబంధరచనా కాలముననే శ్రీరామ కవిగారి హృదయాదర్శమున బ్రతి బింబితమై యుండునని నా యూహ-

### కృష్ణభక్త కల్పద్రుమ శతకము

ఈ శతకము దేవీభాగవతాంతర్గతమైనది. సంస్కృ తములోనిది. భగీరథుడొనర్చిన గోలోకవాసి కృష్ణ స్తోత్రఘట్టము. సంస్కృత దేవీభాగవతమున నిది నవమస్కంధములోని ఏకాదశాధ్యాయమునందున్నది. అందు భగీరథుఁడొనర్చినస్తోత్రమునుకవివ్యాసమాత్రము ప్రపంచింపలేదు. అందు

'తుష్టావ దృష్ట్వా నృపతిః ప్రణమ్యచ పునఃపునః'

అని మాత్రమే యున్నది. కాక పోయినచో మూడు శ్లోకములన్నరయందు శ్రీకృష్ణుని పర బ్రహ్మత్వ స్ఫోరకములైన విశేషణములను బ్రయో గించియున్నాడు. ఆ విశేషణపదముల నాశ్రయించియే

యీ శతకమును జెప్పినారనవలయును అట్లు గాక యిది స్వకపోల కల్పితమనుటయే యుచితముగా నుండును. ఈ శతకములోని రచన యనుభవశాలి యైన వేదాంతి శాస్త్రములోని పడిగట్ల నెత్తిచూపుచుఁ బూర్వపక్ష సిద్ధాంతరూపమున గావించి యాత్మవిచార గతిగా నున్నది. ఒకి విధముగా నిందలి రచన వసు రాయకవి చింతామణి గ్రంథరచనను బోలియున్నది.

ఇందలి కొన్ని వాక్యములు పండితైక వేద్యములై హృదయములై యున్నవనుట యతిశయోక్తి కాదు.

'హంసల్ పుచ్చెద రేమివింత యిది-'

హంసలు పుచ్చుట యనగా ఉచ్ఛ్వాస నిశ్వాసము లను వ్యర్థము చేయుట యని యర్థము నిచ్చు ప్రౌఢ ప్రయోగము.

34 వ పద్యమున సంసారమును తోలుబొమ్మ లాటగాఁ బోల్చిరి. క్రొత్తదైన యుపమానము.

గిల్లి ముద్దో - పిల్లవానిని గిల్లి ముద్దాడు పద్ధతి యిందు బేర్కొనబడినది.

४४ వ పద్యము -

పదివేలేండ్లు తపంబు సేసినను నీ భక్తుండు గాకెట్లు భాస్వదురు జ్ఞాన సమేతు డయ్యెడిని -

ఈ పద్యము భగీరధునికి సమన్వయించుచున్నది. కోతిన్ బ్రహ్మనుజేయు నీ కరుణకున్॥52 పద్యము. హనుమంతుడు భవిష్యద్బ్రహ్మ యగునని పురాణ వచన ప్రమాణము.

ప్రహ్లాదుని విషయము 54 పద్యమునందుట్టంకించ బడినది. ఈ హనుమత్ప్రహ్లాదుల విషయము భగీర ధుని కాలమున బట్టి చూచిన సరిపోదేమో ! లేదా యుగాంతర విషయములని సరిపెట్టుకోవలయును.

64 వ పద్యమున బాహ్యార్చనా నిరాకరణచ్ఛాయ యున్నది.

85 వ పద్యమున జ్ఞానభక్తి కాండముల హేయ త్వోపాదేయత్వములు విచారించుచు దివ్యజ్ఞానము నీది, భక్తియందలి తీపి నాదియని చెప్పుట మనోహరము-

ఈ శతకమునందు గొన్ని స్వతంత్రప్రయోగములు కారణైక్యత - తద్ధిత పైతద్ధిత ప్రయోగము - (87)

ముంచో ముంచకయో - ముంచియో అని యుండ దగును - క్త్వార్థముపై నికారసంధి - (86)

ఆధివ్యాధి జరామరాది మయకాయంబు - (78) జరా+అమర+ఆది ఇందమర శబ్దమునకర్థముపొసగము. జరామరణమయ- అని యుండదగును-

ఈ సందర్భమున నొక్క విషయము గమనింప వలయును. శ్రీదాసు శ్రీరామమహాకవి విమర్శకాగ్రేస రులు. దేవీభాగవతారికయందు రేఫ శకటరేఫములను గూర్చియుఁ గొన్ని యతి ప్రాసములను గూర్చియు నిష్కృష్టముగా విమర్శించి శిష్టగ్రాహ్యమైన పంథనను సరించిన యనుభవశాలి. ఆయన గ్రంథమునందున్న స్వతంత్ర పయోగములు భావికవులచే స్వచ్ఛందము గాఁ బ్రయోక్తవ్యములేయని చెప్పదగును. 'నిరంకుశాః కవయః.'

చక్కట్ల దండ

ఇదియొక అచ్చతెనుఁగు శతకము. లోకవృత్తము నీకవి పరిశీలించినటులు మఱియొకరిచేఁగాదని యీ శతకము ఋజువు చేయుచున్నది - చక్కట్లదండ యనగా లౌకిక నీతిమాలిక యని కవిగారే యర్థము వ్రాసిరి. ఈ శతకమునందలి ప్రతిపద్యమును గవిగారి యనుభవమై భవమును బ్రజ్ఞావిశేషమును వేనోళ్ళఁ జాటుచున్నది. తత్సమ శబ్దముల జోలికిబోక కేవలము జానుదెనుఁగునఁగబ్బము వ్రాయుట యలతియైన పని గాదు. ఇట్టి యచ్చతెనుఁగు కబ్బములు వ్రాసిన వారెల్లరు నేదోయెకచోట బ్రమాదపడుచునే వచ్చిరి. శ్రీరాములుగారన్య దేశ్యములనెక్కువగా వాడిరి. కాని వారిలోనున్న విశేషము తెలుగుపలుకుబడి చెడకుండఁ

బట్టుట- ఇది భాషాప్రియులెల్లరు చూడదగినగ్రంథము ఈ కబ్బము చివర 98, 99 సీసపద్యముల యందున్న శ్లేషవివరింపబడినది. గెలుపుసాలు - జయ సంవత్సర మనిరి. ఇది నేయార్థముకదా! అయినను నిట్టి కబ్బములఁబొదుగుటలోఁగ్రై సరులకీ యగచాట్లుతప్పవు. ఉగ్రశ్రవసుడు వెట్టచెవులతపసి రాయుడు కాలేదా?

ఏతావతా శ్రీ దాసు శ్రీరామకవిగారు బహుముఖ ప్రజ్ఞాధురంధరులైన మహాకవియనుట నిస్సంశయము. **A Versatile gen ius** ఆయన యొక మహాసముద్రము. అందనేక రత్నములకలవు. పరిశీలింపఁ జాలు పరీక్షకులకే వాని యౌన్నత్య మెఱుకపడును.

తంజావూరు కవులయుగము తరువాతవచ్చిన సారస్వతయుగమును క్షీణయుగమని సాహిత్య చరిత్రకారులు వ్రాయుచున్నారు. శ్రీ దాసు శ్రీరాములుగారి వీయుగములోఁజేర్చినచో నది క్షీణయుగముకానేరదు. వారిని గూడ నధునాతనయుగమున జేర్చినచో నది వేఱుమాట.

ఆచంద్రతారకం బాంధ్రియున్నన్నినాళ్
దాసు శ్రీరాముండు ధరణివెలుఁగు (నిలుచు)

స్వస్తి

  

# దాసు శ్రీరామమహాకవి కృతులు

తెలుగు అక్షరాస్యులందరూ పండితులేకదా. నిరక్షరాస్యుల పాండిత్య విశేషాలనుగురించి ఊహించుకుని, విని, అతిశయింపజేసి, వాటిని గురించి వన్నెలు చిన్నెలుగా చెప్పుకుంటూ, వాటిని ఏ విశ్వవిద్యాలయమూ, ఏ భాగ్యవంతుడూ ప్రచురించదేమా అని అడిపోసుకుంటూ 'సాంస్కృతిక కాలక్షేపం' సాగిస్తూ ఉంటారు పలువురు.

మరొక బాపతు — వీళ్లు ఏం చదువుకున్నవారో చెప్పలేంగానీ - ఇంగ్లీషు ముక్కలు, పత్రికలలోని మాటలు అలవర్చుకుని, "గ్రాంధికం తప్పు, వ్యావహారికం ఒప్పు, గ్రామ్యం దివ్యం" అని ప్రబోధిస్తూ ఉంటారు. వీరికి రాజకీయవాదుల అండదండ. ఉన్నది ఉన్నట్లు చదివి రసంఉంటే రసమో, ప్రబోధం ఉంటే ప్రబోధమో, ఏది ఉంటే అది స్వీకరించి ఊరుకోరు. తీరా గ్రాంధికం, గ్రామ్యం, వ్యావహారికం అనేవి విభిన్న భాషలా!

ఇంకొక బాపతు - పుస్తకం చూడడం - దీనిలో ఫలానా ముక్క చూడండని పాఠకుని ముందు పారేసి, 'ఇది ఎంత రమణీయంగా ఉందో చూడండి - ఇది ఈ ఫలానా రచన చేసిన మహాపీయునికే తగును' అని పొగడేస్తుంటే, "ఈ ధోరణి అర్థం కాకపోతే మన పరువు దక్కదు" అని నాటోటివారు హడలిపోయి, రసపానమత్తతకు చిహ్నంగా తల ఆడించివేయడం. తెలుగులో కవిత్వం వ్రాసిన ప్రతి పూర్వ కవినీ ఇట్లాగే కాలక్షేపంలోకి దించేశారు పండితులు.

పాపం! మరికొద్దిమంది ఈ రచన ఏ కాలంనాటిది, రచయిత స్వీయచరిత్ర విశేషాలు ఈ శబ్దాల వెనుక పొంచిఉన్నాయా? రచయిత కాలంనాటి చరిత్రాంశాలు ఎక్కెడెక్కడ ఉబుకులాడుతున్నాయి?... రచనలో లోగుట్టు ఏమిటి? — ఇట్లా తంటాలు పడుతూ ఉంటారు.

మరిదాను- మరికొందరు మరీ గొప్ప పండితులు పాత్రోచిత భాష ఉందా లేదా అని కూడా చూస్తూ ఉంటారు. మన ఈ బహుళాంధ్రోక్తిమయ ప్రపంచంలో, లోకి కొక లోకం, మందలో పడినప్పుడుతప్ప,

ఎవడి తెలివిని వాడు ఇకఇది పరాకాష్ట అనుకోవడం సాధారణమే అనాలి. ఒకధీరుడు, ఒకసత్పురుషుడు తనకుతోచిన రీతిన తాను వ్రాసుకుపోతే, విమర్శకులు కొంతకాలానికి వచ్చిపడి, నానాగొడవచేసి వారిలో ప్రాపకం ఉన్నవాడు ఒక పుస్తకం అచ్చువేయించుకొని, మిగతావారిని వెనక్కి నెట్టిపెడ్తారు. ఇంతే.

దాసు శ్రీరాములుగారు చేసిన కృతులకూ, నా ఉపోద్ఘాతానికి సంబంధం ఏమిటి? శ్రీరాములు గారు గతించి ముక్కాలు శతాబ్దం అయింది. వారు న్యాయవాది. ఉపాధ్యాయుడు, కవి, ధర్మశాస్త్రవేత్త, సంస్కారప్రియుడు, సనాతనుడు, రసికుడు, సన్మిత్రుడు, గృహస్థు. ఆనాటి తర్కవితర్కాలు వేరు, మన కాలపు బాణీలనుబట్టి వారి రచనలను, జీవనసరళిని పరిశీలించరాదు.

ఆ కాలంలో శ్రీరాములుగారు రికామిగా హుందాగా జీవనంగడిపారు. వాదించడానికి ఎక్కువ దావాలు రాకపోతే, ప్రజ్ఞతో బ్రతుకుగడవకపోతే, పోషకుణ్ణి ఆశ్రయించుకొనడం అప్పటి ఆనవాయితీకాదు. అప్పుడూ ద్వేషాలు, కావేషాలు ఉండేవి. అవన్నీ ఇప్పుడు రాజకీయాలైనాయి. ఇంతకూ, ఆయనవద్దకు దావాలు తెచ్చిన వారిలో తోట్లవల్లూరు జమీందారు ఒకడు, జమీందారు ఏమి చదువుకున్నాడో తెలియదు, అప్పుడు గూడా ఇప్పటివలెనే, ధనం అధికారం ఉంటే పెద్దమనిషిగా చెలామణీ అయ్యే అవకాశాలుండేవి. ఇప్పుడు 'డాబు' ఉన్న పెద్దమనిషి కావచ్చు. ఈ జమీందారు మంచి సాహసి అని పేరుగలవాడు. ఇతని కుమారుడు

కూడా సాహసే. అయితే సాహసాలకు తగ్గ సమయస్ఫూర్తి, జిత్తులు లేనందువలన కడసారి జమీందారు జమీ పోగొట్టుకున్నారు. ఆ కాలంలో ఒక ధనికునో, ఒక ప్రజ్ఞావంతునో ఆశ్రయించుకొనడం పొరపాటు కాదు. ఇప్పుడూ కాదనుకోండి.

తోట్లవల్లూరు జమీందారు భోగభాగ్యాలను చూసి ముగ్ధులై శ్రీరాములుగారు అతనితో మైత్రి చేశారందామా అంటే, మొదట శ్రీరాములుగారివద్దకు వచ్చింది జమీందారే. వచ్చినతర్వాత మైత్రి ఏర్పడింది. మైత్రి వలన తోట్లవల్లూరుకు వెళ్ళారు శ్రీరాములుగారు. తీరా తోట్లవల్లూరులో జమీందారుగారిని గురించిగాక, అక్కడి దేవాలయంలో నోరూ వాయా లేకుండా ఉన్న వేణుగోపాలస్వామి భక్తులై, ఆ స్వామివారిపైన పాటలు వ్రాశారు. ప్రతిఫలం, వస్తురూపంలో ఏమి ఉంటుంది?

అప్పుడు దేవదాసీలుండేవారు. భాగ్యవంతుడైన ఆసామి నిర్వహణలోఉన్న దేవాలయానికి దేవదాసీలు తప్పక ఉండేవారు. పండితుల మెప్పు పొందగల ప్రజ్ఞావంతులు. జమీందారుగారిమిత్రుడైన పండితుని, నాలుగుపాటలు వ్రాసిపెట్టండని అడిగే నిబ్బరం, చనువు అటువంటివారికి కాక మరెవ్వరికుంటుంది? జమీందారుగారిపైన పాటలుకావు. (ఒక్క పాటమాత్రం నరసింహనాయనికి అంకితంగాఉంది") భగవంతునికి అంకితంగా వ్రాసినపాటలు. వాటిని ఆ దేవదాసీలు పాడుతూ అభినయిస్తూఉంటే, జమీందారు మెచ్చాడు. శ్రీరాములుగారూ మెచ్చారు. ఈ మెచ్చుకోళ్ళే వారు పరస్పరం ఇచ్చుకున్న వెచ్చం. ఈ రసగ్రహణ ప్రజ్ఞలే వారిమధ్య మచ్చికలు. శ్రీరాములుగారు చాలా నిష్ఠాపరుడు. పాటలన్నీ రామునికో, కృష్ణునికో, వినాయకునికో నైవేద్యంపెట్టుకున్నాడు. కొన్నిచోట్ల భక్తిభావం, కొన్నిపట్ల సఖీభావం– తనమనోరథాన్ని చూరగొన్న విన్నాణపు దొంగకు మంగళంపట్టాడు. విలాసినులచేత పట్టించాడు.

శ్రీరాములుగారికి సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు వచ్చు. పండితునికి వచ్చినట్లేవచ్చు. హాయిగొల్పే తెలుగులో వ్రాశాడు. తెలుగుమాటలు చాలవరకు మనం ఇప్పుడు మరిచేపోతున్నాం. తెలుగును గిరిజనబాసకు కుదించి, చాలావరకు మారుబాసలు పలుకుతున్నాం. సరిగా తెలుగు మాట్లాడ్తే, నేటి విద్యావంతులు, అడవి జంతువును చూసినట్లు తేరిచూస్తారు. మనస్సులోనైనా నవ్వుకుంటారు. శ్రీరాములుగారి కాలంలో అట్లానవ్వుకునేవారు కారేమో!

వారు సంగీతానికి ఒదిగేభాష వ్రాశారు. లయవెంట అంటివున్నశబ్దాల పొందిక – స్వరస్థానాలలో నిలిచి పలికే శబ్దాలు – – చక్కటి శబ్దగుచ్ఛాలు ఎన్నో – – పొత్తుగడియ, చేతిసంచివెచ్చము, తేనియవిసము, ఈ వన్నెలేలనే, చెలిమి కాకి కోకిల చందమాయె, వగైరా స్వరజతులు కూర్చారు. పాటలలో ముఖ్య లక్షణం. అవి లయశృతుల మాలికలు.

శ్రీరాములుగారి కాలంలోనే ఈ జావళీలను, కృతులను, పదాలను అనేకులు పాడుకుంటూ ఉండేవారు నర్తించేవారు. ఆయన సంగీత విద్వాంసుడు. భరత నాట్యవిదుడు. కూచిపూడి భాగవతులలో కొందరు ఆయనకు మిత్రులు.

"వీరి సంగీతరచనలు కొన్నింటిలో పిఠాపురం వీణాచార్యులు, తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారలు, సమాగేయకారులై స్వరవరుసలను కూర్చుతూ ఉండినట్లు, ద్వారం వెంకటస్వామినాయుడుగారు మాకు చెప్పారు. 'గణనాయకం' అనే కళ్యాణిరాగ కృతిలో చివర 'దాసురామపాల సంగమేశ్వరం' అనే ముద్రలో ఇద్దరిపేరులూ ఇందుకు తార్కాణం' అని శ్రీ రజనీకాంతరావుగారు తమ వాగ్గేయకార చరిత్రములో వ్రాశారు.

శ్రీరాములుగారు తన ప్రపంచాన్ని క్షుణ్ణంగా చూశారు – అర్థంచేసుకున్నారు – సేవించుకున్నారు – ఆనందంతో జీవితయాత్ర గడిపారు. ఆ రసభరిత జీవితంలో ఒక చిన్నఅధ్యాయం వారి బయకారత్వం.

ఆద్యతన ఆంధ్రవాఙ్మయ నిర్మాత :

# దాసు శ్రీరామ మహాకవి

—కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు

ఆంధ్ర సాహిత్యమున, ఆధునిక యుగమున పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్థమున గోపినాథ వేంకట కవి, మండపాక పార్వతీశ్వరశాస్త్రి, కొక్కొండ వేంకట రత్నము పంతులు, దాసు శ్రీరామ మహాకవి అను నలువురును విలసిల్లిరి - వీరు నలువురు ఆద్యతన ఆంధ్రవాఙ్మయ నిర్మాతలని చెప్పదగిన వారే - ప్రాచీన సాహిత్యమును పునరుజ్జీవింప జేయుచు, నవ్య సాహిత్య ప్రక్రియలను ప్రచారములోనికి దెచ్చువారు వాఙ్మయ నిర్మాతలు - పై నలువురిలో గోపినాథము-మండపాక, వీరిరువురు ప్రాచీన కావ్య సాహిత్యోద్ధారకులు కాగా, కొక్కొండ వారు, దాసు శ్రీరామ మహాకవి, ప్రాచీన, నవీన సాహిత్య ప్రక్రియలను రెండింటిని ప్రచారములోనికి దెచ్చిన మహాపురుషులు - వీరిలో దాసు శ్రీరామ మహాకవి గారిని గూర్చి యీ వ్యాసమున దెలుపుచున్నాను - వీరికాలము (1846-1908)

శ్రీరామకవిగారు, సంస్కృతాంధ్రభాషలు రెండింటి యందును సమాన పాండిత్యమును గలిగిన వారు- పాండిత్యముతో పాటు ప్రతిభావంతమగు కవిత్వ ప్రౌఢిమ గలవారు - జగద్విఖ్యాత శతావధానులగు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారే వీరిని "అభినవశ్రీనాథుడు" అని ప్రశంసించి, ఇట్టి కవి యధునాతన యుగములో లేడని నిర్ణయించిరి.[1]

శ్రీరాములు గారు - సర్వతోముఖప్రజ్ఞ కలవారు. వీరి కవితా ప్రకర్షకు, వీరికి గల జ్యోతిశ్శాస్త్రము, ధర్మశాస్త్రము, సంగీతము, న్యాయశాస్త్రము మున్నగు వాని యందలి వైజ్ఞానిక పాటవము, వన్నె గూర్చినది - వీరి సాహితీ సృష్టి ఎన్ని ముఖములుగా వెలసినదో ఇక పరిశీలింతము.

## ప్రాచీనము

**1. పురాణములు:-** పురాణాంధ్రీకరణము ప్రాచీనమే - శ్రీరామకవిగారిదివరకు తమ పూర్వ కవులెవ్వరును తెలుగు చేయని దేవీ భాగతమును తెలుగు చేసిరి. వారు న్యాయవాదులై నిరంతరము లౌకిక కార్య వ్యగ్రులై యున్నను - నిట్టి మహాగ్రంథమును రచించుటట-వారి యమేయ కవితా పాటవమును దాటుచున్నది- దీనియందాఱువేల పద్యములు కలవు- ఇట్టి మహా కృతిని వారైదు నెలలలో - అటు తమ స్వకార్యములను నిర్వర్తించుకొనుచు, నిటుల మహాకావ్యమును పూర్తి చేసినారన్న - అది ఆద్యతనాంధ్ర వాఙ్మయమున నొకవిశిష్ట ఘట్టము - శ్రీరాములు గారికి కొంచెము మాత్రమే పూర్వులగు, ములుగు పాపయారాధ్యులవారును, సమకాలికులగు త్రిపురాన తమ్మయ దొరగారును దేవీభాగవతము నాంధ్రీకరించిరి. కాని ఇంత స్వల్పకాలములో వారు చేయలేదని తెలియుచున్నది- ఆధునిక యుగమున, పురాణాంధ్రీకరణమునకు శ్రీరాములు గారు మార్గదర్శకులు- తిరుపతి వేంకట కవులు పద్యకావ్యముగాను, విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారు స్థానాపతి రుక్మిణమ్మగారు వచనము గాను దేవీ భాగవతమురచించిరి. జనమంచి శేషాద్రి శర్మగారు, బ్రహ్మాండ పురాణము, ములుగు చంద్రమౌళిగారు - లింగ కూర్మ పురాణ

---

1. చూడుడు. దాసు శ్రీరామ మహాకవి. అయ్యంకి వేంకట రమణయ్య సన్మాన సంచిక - (1942).

ములు, పిఠాపురం చిదంబరశాస్త్రి గారు పద్మ పురాణమును పద్యకావ్యముగా రచించి, పురాణ వాఙ్మయమునకు దోహద మొనర్చిరి.[2]

**2. శతకములు :-** శతక రచన ప్రాచీనమే. ఈ ప్రక్రియలో వీరితరులకన్నా నాలుగు విధములుగా ప్రత్యేకత చూపిరి.

1) సంస్కృత భాషలో శతకమును రచించుట : కామాక్షి శతకము ఒక్కకొక్కొంత వారు తప్ప యీ యుగమున సంస్కృత భాషలో శతకము రచించిన వారు కీ॥ శే॥ జటావల్లభుల పురుషోత్తము గారు (చిత్ర శతకము) తప్ప వేరెవ్వరును లేరు.

2) సంస్కృతమున రచించుటయేగాక, సంస్కృతమున మయూర మహాకవి సూర్యశతకము నాంధ్రీకరించి యున్నారు.

3) తెలుగు భాషలో - 1. సోమలింగ శతకము, 2. చిలుకలకొలికి శతకము, 3. ముద్దుగుమ్మ శతకము, 4. అచ్చ తెలుగులో శతకము రచించుటకు వీరే యాద్యులు, చక్రవర్తులనంత - వీరి తరువాత అచ్చ తెలుగు శతకము వ్రాసిన వారు - కీ॥ శే॥ అజ్జాడాది భట్ల నారాయణదాసు (హరికథా పితామహుడు)

**3. అచ్చ తెలుగు రచన :-** ఈ యుగమున అచ్చ తెలుగున రచనలు చేసిన గురువురు, ముఖ్యులలో శ్రీరాములు గారొకరు - వారు శాకుంతల నాటకమును అచ్చ తెలుగులోనే రచించినారు-

**4. యక్షగానము :-** ఈ ప్రక్రియ దక్షిణాంధ్ర వాఙ్మయమున క్రీ॥ శ॥ 1600 ప్రాంతము వఱకు నుండెడిది- ఉత్తరాంధ్రదేశమున వీని రచన యంతగా కనపట్టదు- వీరు 1) సాత్రాజిత విలాసము 2) లక్షణా విలాసము అను రెండు యక్షగానములు రచించుట విశేషము.

## నవీన సాహిత్య ప్రక్రియలు

**5. ఖండకావ్య రచన - తెలుగునాడు :-** ఇది వినుకొండ వల్లభరాయుని క్రీడాభిరామము (క్రీ. శ. 1440) వెనుక తెలుగులో వెలసిన సాంఘిక కావ్యము. యావదాంధ్ర దేశమున ప్రచారము గాంచినది.[3] దీని తరువాత ప్రసిద్ధమైనది కీ॥ శే॥ భోగరాజు నారాయణ మూర్తి గారి పండుగ కట్నము-దీని రచనము క్రీ.శ. 1899. అనాటికి, తెలుగున ఖండకావ్యము లింకను నవతరించినట్లు లేదు.

**6. నాటకములు :-** నవ్య యుగమున ఇవి సంస్కృత నాటకాంధ్రీకరణములు - స్వతంత్రములు అను రెండు రీతులుగా వెలసినవి. శ్రీరామకవి గారు రెండు విధములను నమోఘముగా సాధించిరి.

### సంస్కృతాంధ్రీకరణములు

1) శాకుంతల మీవఱకు తెలుపబడినది 2) మాళవికాగ్ని మిత్రము 3) ఉత్తర రామ చరిత్ర - మహావీర చరిత్ర 4) ముద్రారాక్షసము 5) మాలతీ మాధవీయము 6) రత్నావళీ నాటకము 7) జానకీ పరిణయము.

**7. వచన రచన :-** శ్రీరాములు గారి అభినవ గద్య ప్రబంధము - ఈ ప్రశస్త వచన కృతి యిప్పుడు పునర్ముద్రిత మైనది. ఇది చిన్నయ సూరి గ్రాంథిక శైలిలో రచితమైనది.

**8. స్వతంత్రములు:-** 1) మంజరీ మధుకరీయము-దీనిని గూర్చి పరిశోధన జరుగవలసి యున్నది. కోరాడ రామచంద్ర శాస్త్రి గారి మంజరీ మధుకరీయమను నాటకమే తొలి స్వతంత్ర నాటకమని కొంత మంది యభిప్రాయము. 2) మనోలక్ష్మీవిలాస నాటకము 3) బుద్ధనాటకము 4) కురంగ గౌరీ శంకర నాటిక.

**9. శాస్త్రీయ గ్రంథములు :-** ఆధునిక యుగమున, తెలుగున శాస్త్ర గ్రంథములు రచించిన వారిలో శ్రీరాములు గారు ముఖ్యులు.

---

2. శ్రీ పిడకా గణపతి శాస్త్రి గారు - దేవీ భాగవతము, సులభ సరళ శైలిలో, దీనిని తెలుగు చేసినారు. అది ఆంధ్రపత్రిక వారిచే పత్రికలో ప్రకటింపబడుచున్నది.

3. దీని ఆరవ ముద్రణము, మనోహరముగా 1974 లో మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి వారు ప్రకటించి లోకమున కందించినారు.

అ) సంగీతము నాట్యము - అభినయ దర్పణము - పదములు - జావళీలు, స్వరజతులు.

ఆ) మత గ్రంథములు - 1) వైశ్య ధర్మ ప్రదీపిక 2) ఆచార నిరుక్తి 3) త్రిమతములు 4) దురాచార పిశాచభంజని 5) పతిత సంసర్గ ప్రాయశ్చిత్తోపన్యాసము 6) శ్రాద్ధ సంశయ విచ్ఛేదము 7) విగ్రహారాధనము 8) పునర్వివాహ విచారణ 9) నౌకాయానము.

ఇ) ఇతరములు - తర్కదీపిక-

ఇట్లు నవలీనుంలో నవ్య ప్రాచీన సాహిత్య ప్రక్రియలను నాధునిక యుగములో వ్యాపింపజేసిన సారస్వత పురుషుడు దాసు శ్రీరామ మహాకవిగారు.

## దేవీ భాగవతము

దాసు శ్రీరామ కవి గారి రచనలలో దేవీ భాగవతము మకుటాయమానమైనది- ఇది నలుబదేండ్ల క్రిందట- ఉత్తరాంధ్ర ప్రాంతిమైన విశాఖమండలమున ప్రచారములో నుండెను - క్రీ॥ శ॥ 1934 లో విజయనగరమున - అయ్యకోనేటి దక్షిణపు గట్టున నున్న- శ్రీ ఆంజనేయ స్వామి దేవాలయమున- దాసు వారి దేవీ భాగవతము - పురాణ పఠనము జరుగుచుండెడిది - ఆ పురాణ పఠనమున పాల్గొను భాగ్యము నాకు లభించినది- ఆధునిక యుగమున రచింపబడిన పురాణములలో దాసు వారి దేవీభాగవతమునకు తప్ప తక్కిన వానికిట్టి పురాణ పఠన ప్రశస్తి రాలేదు - దీని లోకోత్తర విశిష్టతకు నీ విషయ మొక్కటియే చాలును.

అన్ని ఒకయెత్తు, అగస్త్యుడొక్కడు ఒక యెత్తు అన్నట్లు వారి దేవీభాగవతమొకయెత్తు; వారు దానికి రచించిన పీఠిక యొక యెత్తు. అందు ప్రాచీన కవితా సంప్రదాయ లక్ష్య లక్షణములు చక్కగా నిరూపితమైన విమర్శ గ్రంథము గాని కేవలము పీఠికకాదు. అది వేరే గ్రంథముగా ముద్రితము కావలెను- ఈ పీఠిక వలన- శ్రీరామ కవి గారు గొప్ప సాహితీ విమర్శకులని నిర్ధారితము కాగలదు-

వారింటి పేరు "దాసు" దాస గాని వారి కవితా పాండిత్య కావ్య రచనా విశిష్టత చేత, వారు- కవులకు స్వామిత్వము వహించినారు.

దేవీభాగవతము పునర్ముద్రణ చేయుటకై ఆంధ్ర దేశ ప్రభుత్వము వారును, ప్రజలును తోడ్పడుదురు గాక యని యభ్యర్థించుచున్నాను.



శ్రీ

# దేవీభాగవతము

—డా॥ శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు

వ్యాసుఁడు రచించిన అష్టాదశ పురాణములలో భాగవత మొకటి. ఈ భాగవతము విష్ణుభాగవతమా దేవీ భాగవతమా యను విషయమున నభిప్రాయభేద మున్నది. విష్ణుభాగవతము పురాణములలో నొకటి యని కొందఱి యభిప్రాయము. వారి మతమునను సరించి దేవీ భాగవతమే అష్టాదశమహాపురాణాంతర్గత మని తెలియవచ్చును. దేవీ భాగవతారంభమున శౌనకుఁడడుగ సూతుఁడు పదునెన్మిది మహాపురాణములయు నుపపురాణములయు నామము లెఱిగించి

> ప్రతిద్వాపరమున విష్ణుం
> డతులమతిన్ వ్యాసరూపుఁడై పుణ్యములౌ
> శ్రుతులన్ బహువిధములఁదా
> నతికించుశ్లోకమునకు నతిహిత మొదవన్

అని తెల్పెను. తరువాత భాగవతమఘవినాశమనియు, సర్వాగమసారమనియు, ముముక్షువరసాధనమనియు, విజ్ఞాన ప్రాగల్భ్యముకలుగఁజేయు పరమౌషధ మనియు వర్ణింపఁబడినది. ఇందుకూడనేది మహాపురాణమో యేది యుప పురాణమో విశదీకరింపఁబడియుండ లేదు. దేవీ భాగవతమును రచించి వ్యాసుఁడు దానిని తన సుతుఁడైన శుకమహర్షికిఁ జెప్పెను. అప్పుడా తనితో పాటు సూతుఁడు కూడ దానిని విని తరువాత శౌనకాదులకు చెప్పెను. అఘము లొనరించి వేదధర్మాచరణము మానినట్టి వాఁడైనను ఏదైన వ్యాజమున భాగవతము వినఁజాలినచో నైహికాముష్మిక సుఖములు పొందఁజాలును. భాగవతమును భావగతము చేయువాఁడు శ్రీ విద్యావిలసితుఁడై పునర్భవదుఃఖమునకు పాలుగాక అక్షయ మోక్షానందమునను భవించును. భాగవతమును భావగతము కావింపనివాఁడు విధివంచితుఁడై పశుతుల్యుఁడగును.

దేవీ భాగవతమును పలువురాంధ్ర కవులు పద్యగద్యరూపమున నాంధ్రీకరించి యుండిరి. వారిలో ములుగు పాపయారాధ్యులు, త్రిపురాన తమ్మన దొరగారు, శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు, శ్రీదాసు శ్రీరాములు పంతులుగారు అనువారు దానిని చంపూరూపమున నాంధ్రీకరించిరి. శ్రీ నోరి నరసింహశాస్త్రి గారి యాంధ్రీకరణమ సమగ్రముగనే యుండిపోయినది. వీని యన్నింటిలో మొట్టమొదట ముద్రితమైనది శ్రీ రాములు పంతులుగారిది. శ్రీ శ్రీరాములు పంతులుగారు క్రీ.శ. 1846వ సంవత్సరమున కామాంబా కన్నయ మంత్రులకేకైక పుత్రులుగా జన్మించి 1908వ సంవత్సరమున తమ 62వ యేట పశ్చిమ గోదావరీ మండలమునందలి ఉప్పుఏలూరులో దివంగతులైరి. వారాంధ్రాంగ్ల గీర్వాణభాషలు మూఁడింట నిష్ణాతులై, సర్వశాస్త్రపారంగతులై బహుపద్యగద్య గ్రంథములనే కాక జావళీలను న్యాయబోధ, వైశ్యధర్మ దీపిక అను శాస్త్రగ్రంథములను, సంగీతశాస్త్ర గ్రంథములను రచించి సర్వతోముఖ ప్రతిభాశాలులను ప్రఖ్యాతి గడించిరి. వారు రచించిన పద్య గ్రంథములలో తెలుగునాఁడను పీఠియు, దేవీ భాగవతాంధ్రీకరణమును మిక్కిలి ప్రసిద్ధి నొందినవి. పండ్రెండు స్కంధములును, పదునెన్మిదివేల శ్లోకములునుగల దేవీ భాగవతమును వారు న్యాయవాది వృత్తి నిర్వహించుచునే అయిదు నెలల కాలములో పూర్తి చేయఁజాలుట వారి కవితా దీక్షకును, రచనా వేగమునకును తార్కాణములు.

శ్రీ శ్రీరాములు పంతులుగారు దేవీ భాగవత గద్యమున తమకు శ్రీమదిష్ట కామేశ్వరీ పాదారవింద మకరందతుందిల మానసేందిందిర, శ్రీ వేంకటేశ్వర వర ప్రసాద సంభూత కవిత్వ విద్యా విశేష బాల్యాది రచిత త్రింశత్ప్రత్యేక గ్రంథ మతిసార అను విశేషణములను వాడుకొని యుండిరి. వారి మహా పురాణము సలూపు నందలి సోమేశ్వరస్వామి కంకితము కావించి యుండిరి. గ్రంథారంభమున వారు కావించిన స్వీయ వంశవర్ణనమును, సోమేశ్వరస్వామి వర్ణనమును వారికిం గల సుదృఢ భక్తిని వేనోళ్ళచాటు చున్నది. అల్లూరును గూర్చి వారు రచించిన పద్యములు వారి యభిజనాభిమానమునే కాక కవితా కౌశలమును కూడా చాటు చున్నవి. వారందు తాము రచించిన 34 గ్రంథముల పేర్లను సూచించి కాలాంతర వశంబున దైవప్రేరితులనై మున్నుది యైనవ తమ రచనలలోని కెల్ల పౌరాణిక పరిమాణములందు మిన్నయైనదియగు దేవీ భాగవతమును తెలిగించబూనినట్లు సూచించి యుండిరి. గ్రంథము మొదట ముద్రితమైన పరిప్రాసనం శయ విన్యాసమను భాగము వారికి కవితా విషయమునం గల విశాల దృష్టిని, ప్రయోగ పరిజ్ఞానమును విశదీకరించుచున్నది. పూర్వకవి రచితములైన కావ్యములనే కాక లక్షణగ్రంథములనుకూడ వారు కూలంకషముగా పరిశీలించి యుండుట యాశ్చర్యము కలిగించును.

ఆంధ్ర వాఙ్మయమున కవులవలంబించిన అనువాద పద్ధతిని మూడుతెఱంగులుగా విభజింపవచ్చును- కథానువాదము, భావానువాదము, పదానువాదము. కవిత్రయము వారిది కథానువాదము, శ్రీనాథాదులది భావానువాదము, ఆధునిక నాటకానువాదకులది పదానువాదము. కథానువాదమెంత స్వతంత్రమో పదానువాదమంత మూల విధేయము. మూలమునననుసరించుచునే యెనసెనకొంత స్వాతంత్ర్యము చూపుచు సాగించు భావానువాద విధానముపై మూడించిలో నుత్తమముగా తోచును. శ్రీ శ్రీరాములు పంతులుగారు దేవీ భాగవతము ననుసరించుపట్ల శ్రీనాథునివలె భావానువాద విధానమునే యవలంబించిరి. వారి యనువాద విధానమును గూర్చి శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు చెప్పినవిషయము లత్యంతసత్యములు. వారు మూలమునందలి భావములను విడువక యప్పటప్పట సందర్భానుగుణముగా కొన్ని భావములను చేర్చుచు, కొన్నిచోట్ల నించుక సంగ్రహించుచు నౌచిత్యశోభితముగను, సర్వ సుబోధముగను రచన సాగించి యుండిరి. అది స్వతంత్రముగా స్వతంత్రమువలెనే తోచును గాని యెచ్చటను అనువాదమను భావమును గలిగింపదు. దేవీ భాగవతమున నచ్చటచ్చట మంత్రతంత్ర యోగశాస్త్ర రహస్యములుటంకింప బడియున్నవి. అట్టి చోట్ల ననువాదకులు కొందరు క్లేశమునను భవించిరి. శ్రీ పంతులుగారు పలు శాస్త్రములందు కూడ ప్రవీణులగుటచే నట్టి శాస్త్ర విషయ గంభీరములైన భాగములను గూడ స్పష్టముగను, అక్లిష్టముగను, సిద్ధహస్తముగను అనువదించి యున్నారు.

దేవీ భాగవతము శుకోత్పత్తి కథనముతో నారంభించుచున్నది. ఇందు ప్రసక్తానుప్రసక్తముగా పెక్కుపాఖ్యానములు వివరింపబడినవి. వానిలో సుద్యుమ్నోపాఖ్యానము, సత్యవ్రత చరిత్ర, నారదవృత్తాంతము, హరిశ్చంద్రోపాఖ్యానము ముఖ్యములైనవి. శ్రీ పంతులుగారు వీనిని రచించుటలో చూపిన కథా కథన కౌశలము ప్రశంసనీయమై యొప్పుచున్నది. శశికళా స్వయంవరమొక చక్కని ప్రబంధమువలె నున్నది. పంచమస్కంధమున దేవి మహిషాసురాదుల సంహరించిన వృత్తాంతము విపులముగా వర్ణింపబడినది. దేవికిని మహిషాసురుని దూతకును జరిగిన సంవాదము తిక్కనగారి యుద్యోగ పర్వరచనను తలపించుచున్నది. ఎవరెవర నాయా వ్యక్తులు కావించిన దేవీ స్తోత్రములు భక్తిభావపూరితములై శ్రీ పంతులుగారి సహజ భక్తి సంపన్నతను ప్రకటించుచున్నవి. చివరి రెండు స్కంధములలో సదాచారవిధులు, బ్రహ్మయజ్ఞాదులు, గాయత్రీ మహిమానుభావములు విశదీకరింపబడినవి. దేవీ భాగవతము పురాణమగుటచే నందుతత్పంచ లక్షణములును యథోచితముగా వర్ణితములైనవి. ఇందలి మన్వంతరముల వృత్తాంతము గమనింపదగినది. దేవీ భాగవతము నందలి వస్తు విన్యాసము పరిశీలింపగా నొక విశేషము కనిపించును. ఇందు రామాయణ భారత భాగవతకథలందలి ముఖ్య విషయములన్నియు సంగ్రహముగా చెప్పబడినవి ఈ విధముగా దీనిని సర్వేతిహాసపురాణ సారమని చెప్పవచ్చును. శ్రీ దేవీ మంత్రతంత్రానుష్ఠానముల వంశకల్లోలాదమందు సప్రమాణముగను సనిదర్శనముగను నిరూపింపబడినది.

శ్రీ పంతులు గారు వర్ణనమునందు సిద్ధహస్తులు. వారి పరిశీలనశక్తి యాశ్చర్యకరమైనది. వర్ణ్యవస్తువు నకు సంబంధించిన వివిధాంశములను వారు విశద ముగా విమర్శించి దానిని పఠితల యెదుట సాక్షాత్క రింపఁజేయుదురు. వస్తువులను, వ్యక్తులను, ప్రకృతిని వర్ణించుటలో వారు చూపిన నేర్పు ప్రశంసనీయముగా నుండును. శశికళా స్వయంవరము మున్నగు భాగము లందు వారి రచన ప్రబంధ ఫక్కీ ననుసరించినది. అచ్చటి వియోగ వర్ణనము సంగ్రహముగ్యు సరస ముగా నున్నది. యుద్ధమును వర్ణించునప్పుడు శ్రీ పంతులుగారనవసర వివరములనొసఁగక ముఖ్య సన్ని వేశములను మాత్రము పేర్కొని పఠితల కిబ్బందియు విసుగు లేకుండఁజేయుదురు. పంచమషష్ఠాశ్వాసము లందలి యుద్ధ వర్ణనము లిందుకు తార్కాణములు. శ్రీ వర్ణనము చేయునపుడు కూడ శ్రీ పంతులుగా రౌచిత్యము నెంతో జాగరూకతతో పాటింతురు. చండ ముండాదులు గానముచేయు దేవిని శుంభునకు వర్ణించు సన్నివేశము పంచమ స్కంధమందున్నది. ఆమెను వర్ణించు పట్ల రాక్షసులు సైతమౌచిత్యపు మర్యాద నతిక్రమింపకుందురు శ్రీ పంతులుగారి రచనలోని విశే షము. "సారంగము వరాళి శంకరాభరణంబునకులు కొప్పు నూగారునయ్యె...వెయ్యేల కోమలాంగి మయి దలంచెద సంగీత మయమటంచు (5-507)" అను సీసము శ్రీ పంతులుగారి శబ్ద ప్రయోగ పాటవమును సంగీతశాస్త్ర పాండిత్యమును సమముగా చాటుచున్నది. ఇచ్చటి పద్యములలో శ్రీదేవి యతిలోక సౌందర్య మపూర్వముగా వర్ణింపబడినది.

పాత్ర పోషణమున శ్రీ పంతులుగారు చూపు శ్రద్ధ ఆశ్చర్యకరముగా నుండును. వారు ప్రధాన పాత్రల గుణ రూప స్వభావముల వలెనే అప్రధాన పాత్రల గుణ రూప స్వభావములను కూడ నెంతో స్పష్టముగా వర్ణింతురు. శ్రీ దేవి మహిమానుభావములను భక్త పరాధీనతను, శశికళ పవిత్ర ప్రేమను, నారదముని వాక్చాతుర్యమును, మహిషాసుర శుంభనిశుంభాదుల యౌద్ధత్యమును, హరిశ్చంద్రుని సత్యవ్రత పరాయణ తను, కాలకౌశికుని నైచ్య వికృత రూపములను, శుకుని వైరాగ్యమును, శ్రీరాముని యౌదాత్త్యమును వారు చిత్రించిన విధమిందుకు నిదర్శనము.

శ్రీ పంతులుగారు వివిధ రసముల నెంతో అభిని వేశముతో వర్ణింతురు. పంచమ షష్ఠస్కంధములందు యుద్ధములను వర్ణించు సందర్భములలో వారు వీర రౌద్రబీభత్సములను చక్కగా పోషించి యుండిరి. హరిశ్చంద్రోపాఖ్యానము కరుణరస భరితముగా నున్నది. ఏకాదశ ద్వాదశస్కంధములు శాంతరస నిలయములు. నారద వృత్తాంతము వర్ణించుపట్ల షష్ఠ స్కంధమున హాస్యరసచ్ఛాయలున్నవి. నవమస్కం ధమున భగీరథుఁడు కృష్ణుని స్తుతించు సందర్భము నందలి "కృష్ణా భక్తకల్పద్రుమా" అను మకుట ముతో కూడిన పద్యములు శతక ప్రాయములై భక్తి రస ప్రవాహములనఁదగి యున్నవి. శ్రీ పంతులుగా రేరసమును వర్ణించినను దానికి సంబంధించినవి భావాను భావములను విశదముగా వర్ణించి రసస్ఫూర్తి కలిగిం తురు.

పంతులుగారు సంస్కృతాంధ్రములు రెండింట కూలంకషమైన పాండిత్యము కలవారు. వారచ్చ తెలుఁ గున కూడ కొన్ని గ్రంథములు రచించి యుండిరి. శబ్ద ప్రయోగ విషయమున సైతము వారి దృక్పథము విశాలమైనది. వారచ్చటచ్చట వాడుక పదములను, అన్యదేశ్యములను, క్షేత్రోచిత భాషా పదములనువాడు టకు వెనుదీసి యుండలేదు. వారి పద్యములు ధారా శుద్ధి శోభితములై శ్రీ తిరుపతి వేంకట కవులంత వారికి సైతము మెచ్చుగొల్పినవి. తమ పద్యములందు కంటెను శ్రీ పంతులుగారి పద్యములందు ధారదాను కూల్యము మెండని శ్రీ చెళ్లపిళ్ళ వారే వాక్రుచ్చి యున్నారు. వారు సాధారణముగా శబ్దాడంబరమునకై యత్నింపక జాతీయములు, సులభ సుందరములు, లలితములునైన పదములనే ప్రయోగించు చుందురు. గాంభీర్యమునకై వారు కొన్ని చోట్ల దీర్ఘసమాసములు వాడి యుండకపోలేదు. దశమస్కంధము నందలి రుద్రాదికృత విష్ణుస్తుతి యిందుకు తార్కాణము. ఇందలి దశావతార స్తుతి సమాస జటిలమైన పద్యము లతో కూడి ప్రబంధములందలి దశావతార స్తుతిని తలంపునకుఁ దెచ్చుచున్నది.

శ్రుతి పాటచ్చర పాటనోచ్చలన

సంక్షోభాత్త వేదోంద సం

తతి సమ్యక్కరణానుకూల
జనసభ్య ప్రశంసాచ్ఛ్రవా
గతి భేదామృత పుష్ప వేద
చయ సంగ్రాహ్యైక దక్షోరుప
ట్ల్పుతి విస్తార తురంగ చారు గళ
విస్ఫోటోగ్ర మహాకృతీ॥
10-45

అనుప దంపతి యొక్క పద్యము. ఈ సందర్భము నందలి పద్యములన్నియు సిద్ధి యున్నవి. పంతులు గారి శైలి రసానుకూలమై కొన్నిచోట్ల సలలితలలిత పలుకులతోడను కొన్నిచోట్ల సమాసములతోడను గూడి శ్రవణ సుభగమై యొప్పారు చుండును. సంభాషణ సందర్భములందు వారి శైలి వ్యవహారమునకు సన్నిహితముగా నుండును. వారు శబ్దాలంకారములకై యెప్పుడును యత్నింపరు. కొన్ని పద్యములలో నవి అయత్న సిద్ధములై రచనెంతో సౌందర్యము నావహించుచుండును.

పంకి మరం లేచి భామల లెమ్మన్న
గోడి కూయలేదు, గొల్ల పడుచు
చల్ల చేయలేదు, చయను లేచికి గోవ
లేదు, లేవనేల లెమ్మటన్న 10-36

మున్నగునవి వారి వ్యావహారిక శైలికి నిదర్శనము.

రోలంబ జాలంబ యాలంబ కచపాళి
కాకున్న విరుల సంగాతమేల
చిందంబు నంచంబు చందంబు కందంబు
కాకున్న శబ్ద సాంగత్యమేల. 5-514

మున్నగునవి వారి శబ్దాలంకార ప్రయోగ ప్రావీణ్యము నకు దృష్టాంతములు. వారి సీసములు పెక్కు మత్తేభ యానమున కెనయైన గతి కలిగి శ్రీనాథుని సీసములతో పోటీ చేయుచుండును. వారి రచనలో వృత్త వైవిధ్య మంతగా కనిపించదు. అచ్చటచ్చట ఉపేంద్ర వజ్రా, వసంత తిలకాదులు గోచరించును; రెండు మూడు చోట్ల వారు పర్వసందర్భమున రగడ వాడి యున్నారు. స్తుతి సందర్భముల వారు దండకమును గూడ వాడి యుండిరి. భావ గాంభీర్యమునందేమి, నిర్దుష్ట మధుర పద ప్రయోగమునందేమి, ప్రౌఢత యందేమి, ధారాశుద్ధియందేమి, నిరర్గళ గమనము నందేమి, వారి రచన సర్వ విధముల పూర్వాంధ్ర కవుల రచనలకు సాటివచ్చు చుండును. శ్రీపంతులు గారు ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములను కావ్య హేతువులు మూడును పుష్కలముగా గల మహాకవిపుంగవులు. దేవీభాగవతము వారి సర్వ కవితా కౌశలమునకు పట్టుగొమ్మయైన ప్రశస్త రచన.

అమృతానంద నిధాన మాశ్రిత
బుధ వ్యాపార సంస్తూయ మా
నము శ్రీదేవ్యుదయాభిరామము
కళానాథానుమోదాత్మ కం
బు మణి ద్వీప సువర్ణ వృత్తగణమున్
భూయో మహాభంగ ర
మ్యము శ్రీభాగవతాబ్ధి యేమగు
దుర్గాంభోధి నోలాడెదన్.



శ్రీ

మ హా క వి

# దాసు శ్రీరాములు గారి లఘుకృతులు

—డా॥ శ్రీ పాటిబండ మాధవశర్మగారు

తెలుగు సాహిత్యంతో ఏమాత్రం పరిచయం ఉన్నవారికైనా దాసు శ్రీరాములుగారి పేరు వినబడగానే గుర్తుకు వస్తుంది వారి 'తెలుగునాడు' అనే కావ్యం. ఆ కావ్యం ఎంత చిన్నదో దాని ప్రశస్తి అంత దొడ్డది. అందులోని పద్యాలు కొన్ని అయినా నోటికిరానివారు తెలుగుదేశంలో ఒకప్పుడు ఉండేవారుకారు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి వంటి మహాకవికి ఆ కావ్యంలోని పెక్కు పద్యాలు కంఠస్థములైనాయి అంటే శ్రీరామకవిగారి కవిత్వం ఎలాంటి పాకంలో ఉంటుందో ఊహించుకోవచ్చు.

శ్రీరామకవిగారి లఘుకావ్యాలలో కొన్ని ముద్రితమైనాయి. వాటిలో తెలుగునాడు ఐదు పునర్ముద్రణలు పొందింది. దాని తొలిముద్రణ క్రీ. శ. 1899 లో. చాలాకాలం అలభ్యంగా ఉండిన ఈ గ్రంథం మళ్ళీ ఈ మధ్య 1974 లో ఆరవముద్రణ పొందింది.

శ్రీనాథుని వీధినాటకాన్ని కొంతవరకు అనుసరిస్తూ తాము ఈ గ్రంథాన్ని రచించినట్లు శ్రీరామకవిగారు చెప్పుకున్నారు :

"ఇది నవవీధి, దీనికి ననేకరసంబు, లనేకనాయకుల్
వడవడి మంచిచెడ్డలును, బాగులు నోగులు, మేలు గీళ్ళునుం,
గొదవయు గొప్ప, లంధ్ర జనకోటికి నెట్లగునట్లు చెప్పెదన్
మదిఁ బరికించి కోపమును మానుడు, నానుడుగాను దూరకన్."

అని కవిగారు చెప్పినట్లు ఆంధ్రులలోని-ముఖ్యంగా ఆంధ్రబ్రాహ్మణ శాఖలలోని మంచిచెడ్డలు, బాగోగులు మొదలయినవి ఉన్నవి ఉన్నట్లు ఈ గ్రంథంలో వర్ణించబడినవి. తెలుగు జాతిలోని అన్నివర్గాలవారి ఆచార వ్యవహారాలు, వేషభాషలు, ఆహారవిహారాలు వర్ణించాలి అని కవిగారు సంకల్పించుకున్నారుగాని బ్రాహ్మణప్రశంస అనే ప్రథమ భాగాన్ని మాత్రమే వ్రాసినారు. తక్కినభాగాలనుకూడా కవిగారు వ్రాసి ఉంటే ఆగ్రంథం నూరేళ్ళక్రిందటి ఆంధ్రజాతి సాంఘికజీవనానికి దర్పణం అయి ఉండేది.

తెలుగు దేశంలో వైదికులు, నియోగులు, స్మార్తులు, మాధ్వులు, వైష్ణవులు, శైవులు, కరణకమ్మలు, ద్రావిడులు, గోల్కొండ వ్యాపారులు అని పెక్కు తెగల బ్రాహ్మణులు ఉన్నారు. వీరందరిని గురించి కవిగారు ఈ గ్రంథంలో చమత్కార బంధురంగా వర్ణించారు. అందరూ బ్రాహ్మణులే అయినా ఇన్ని తెగలుగా విడిపోయి ఒకతెగకు ఇంకొక తెగతో పొత్తులేనిస్థితి ఏర్పడటం కవిగారికి బాధకలిగించింది. వారందరూ ఏకంకావాలనివారి

ఆకాంక్ష. ఆయాతెగలవారివి లక్షణ వేషభాషాదులను, స్వభావాలను హాస్యగర్భంగా వర్ణించి అందరూ ఏకం అయ్యేలాగా చెయ్యాలనే సంస్కరణదృష్టితో కవిగారు ఈ గ్రంథం వ్రాసినట్లు వారే పీఠికలో సూచించినారు.

"ఉన్నయది ఉన్నయట్టులు, కన్నయదియు
గన్నయట్టులు, విన్నది విన్నయటులు
నన్నయది యన్నయట్టులు వన్నెవెట్టి
కవితఁజెప్పిన సంతోషమవు జగాన"

అన్న కవిగారి వాక్యాన్ని బట్టి యీ గ్రంథం అంతా స్వభావోక్తిమయం. కవిగారి కల్పన ఏమీలేదు. యదార్థాన్ని ఇంత సుందరంగా చెప్పడమే శ్రీరామ కవిగారి విశిష్టమైన ప్రతిభ. మచ్చుకికొన్ని పద్యాలు.

వైదికులనుగూర్చి—

"సీళ్ళకు, నిల్లు తోళ్ళకును, నేతికరుళ్ళకు, దొడ్డయుత్తరేణ్
నేళ్ళకు. దర్భముళ్ళకును, వేదపునోళ్ళకు, సన్నకుట్టు వి
స్తళ్ళకు, రావిపేళ్ళ, కనిశంబును మళ్ళకు, పప్పుగూర ప
చ్చళ్ళకు, రాగిబిళ్ళకును సంతసమందుదు రాంధ్రవైదికుల్."

"లేవరు లెండు లెండనిన, లేచినవారయినం దటాలునం
బోవరు, పోవుచున్నిలిచి పోదుము పోదుము త్రోయకుండటం
చీవరు సందు, గేస్తు నలయింతురు, పెండిలిలో సదస్య సం
భావననాడు చూడవలె బాపనసాముల సాములన్నియున్"

"వసుఁన నియోగి బాలికను వైదికబాలునకిచ్చి చేయగా
బసనడి యిట్టు నట్టనిన, బాగషు నిష్షనుమంచు నత్తయ
చ్చెస మొనరింప నొక్కతరి పీషష, పెష్షష మామగారికిన్
మసలక పెష్షపెష్ష మను మాటలె పల్కెనటంద్రు గష్షిగన్."

నియోగులను గూర్చి—

"నమ్మిన నమ్మకున్న నది నావశమా? జనులాడుకొన్న వా
క్యమ్ములు నేను జెప్పెద భయంపడియో పడకో, నియోగిలో
కమ్మని వార్య కార్య ఘటకమ్మవుగాని పరోపకార శూ
న్యమ్మును స్వప్రయోజన పరాయణముందల పోయనిర్ధరన్."

మాధ్వులనుగూర్చి—

"సమ్మతి నమ్మకర్మ సహజంబగు కర్మయటంద్రు, నిమ్మక
ర్మమ్మది దుష్టకర్మయని పల్కుచు నుందురు, నోటికేది య
డ్డమ్ము జగమ్మునం భళభళాభళ మాధ్వులవంటివారు ని
క్కమ్ముగ వేరు వేరని పుకారుపకారులు కారుకారిలన్."

"మాధ్వగురుండు వచ్చు నొకమాటు పదేండ్లకు, వచ్చి వారి ధ
ర్మార్థ్వమదేయటంచు, వరహావరహాయొక యగ్నిముద్రకున్
సాధ్వసలీల నిచ్చినను సాకన డింకను బేకు బేకు బే
కు ధ్వనిసేయు, మోక్షమునకుం గరణంబు హిరణ్యమే సుమీ".

శైవులనుగూర్చి—

"తల్లికి భారమా శిశువు? తామర తూటికి పువ్వుభారమా?
విల్లొక భారమా కడిదివీరున? ఒంటెకుగూనుభారమా?
వల్లికి భారమా ఫలము? బట్టెను(గొమ్ములు భారమా? నుతుల్
చెల్లును లింగధారులకు లింగపు గాయలు భారమా? మహిన్."

వైష్ణవులనుగూర్చి—

"గండ భేరుండంచు గల ధోవతీ కట్టు,
కొమరైన పట్టెనామముల బొట్టు
కడుపెద్దముడికి జొప్పడెడి సందెడు జుట్టు
నితరుల కెఱుకగానీని గుట్టు
సామాన్యునకును దుస్సాధ్యంబయిన బెట్టు
ద్రవిడభాషా ప్రబంధముల అట్టు
కఱ్ఱతో, దోలిన(గాని పోలని తట్టు
తట్టంపు తెఱచాటు తళియ పట్టు
అట్టు లిట్టుల ననరాని యట్టియట్టు
లెట్టులే దమ్మ పేశిలో నెట్టు నెట్టు
గట్టిగా( దెల్గు దేశంబు బట్టి నట్టి
వీరవైష్ణవులను దొట్టువారు మట్టు."

ఈ విధంగా ఒక్క పొల్లు మాటలేకుండా, ధారకుంటుపడ కుండా శబ్ద చమత్కారం సుతారంగా ఒలికిస్తూ ఉంటాయి తెలుగునాడులో పద్యాలన్నీ.

## చక్కట్లదండ

ఇది అచ్చతెలుగులో వ్రాసిన నీతిపద్యాల శతకం. అచ్చ తెలుగులో పద్యాలు వ్రాస్తే అర్థంకాదని గోలచేస్తారు తెలుగువాళ్ళు. కాని శ్రీరామకవిగారి చక్కట్లదండ చదివితే అచ్చతెలుగు కండ చక్కెర లాగా ఇంతచక్కగా ఉంటుందా అనిపిస్తుంది. నిత్యం వాడుకలో ఉన్న పదాలనే ఎక్కువగా వాడి కవి గారు ఈ శతకంలోని పద్యాలు ఎబ్బెట్టుగా తోచకుండా చేశారు. ఒక్కవ్యర్థ పదంగాని, మారుమూల పదంగాని లేకుండా ముఖాముఖిహాట్లాడు కుంటున్నట్లు అతిసహజంగా ఉండేభాషలో నూరుసీసపద్యాలు వ్రాయడమంటే సామాన్యమైన పనికాదు. ఒకొక్క నీతిచెప్పటానికి ఎన్నోదృష్టాంతాలు చూపి కవిగారు తమ అపారమైన లోకజ్ఞతను ప్రకటించి నారు. మచ్చుకి—

క్రొవ్విన జెల్ల నిక్కుచు నీళ్ళ మిడిచిన
గట్టుపైఁబడుఁబెద్ద గ్రద్దనోట
పోతరించిన పాము పుట్టెక్కి తలయెత్త
గ్రక్కునఁగదతేరు గరుడినోట
పొగరుకొన్న పొదేలు తెగిమందబాసిన
పీలుగాఁజిక్కుఁదోడేలు బారి
గుంజుబట్టిన నల్లి కోడెక్కి నిల్చిన
గాసిఁజెందును సొంతగాని చేత

కన్నుగానక నెలవులో గదలిమిట్టి
పడినవారికి నిక్కంబె గొడవవచ్చు
ననిపలుకు దాసురాముఁ డిట్లచ్చతెలుఁగు
కబ్బమందమునిండఁ జక్కట్లదంట.

ఇంకొకటి—

"కఱచిన వేపి కాల్గఱచు వాడుండునే
కాకరాకును దబ్బ గట్టుగాక,
దోచిన దొంగయిల్ దోచువాడుండునే
అచ్చాలో ఫిర్యాదు దెచ్చుగాక
కుట్టిన తేల్ కొండి గుట్టువా డుండునే
గచ్చగంధము రాచి తాఁజుగాక
పట్టిన దెయ్యంబు బట్టువాడుండునే
గాలి బూడిది యానఁగట్టుగాక

చెడుగుచేసిన పని చేయఁ జెఱుపుపోదు
చేయవలసిన పనిజేయఁ జెందుమేలు
అనిపలుకు దాసురాముఁడిట్లచ్చతెలుగు
కబ్బమందమునిండఁ జక్కట్లదండ."

ఈ విధంగా వందపద్యాలలో వారుచూపిన దృష్టాంతాలు ఆశ్చర్యం కొలుపుతూ, లోకాన్ని వారెం తనిశితదృష్టితో పరిశీలించారో తెలుపుతూ ఉంటవి.

"చీమకాను ప్రొద్దు చెప్పనేర్పు నెవండు
దామకానుపు చెప్పఁ జాలుగాక"

"వరివెన్ను విడిచి కొబ్బరికాయ కాసించు
చిలుకేమిటిను ముక్కు చెడుటెకాని"

"కొమ్ము కోతిని నెఱుంగుమనన్నవాడు రెం
డన్న నేమని పదారన్న నేమిః"

"పట్టజాలము నీళ్ల పాలలోఁ గలిసిన
తెలియమే పెరుగులోఁ గలిసినప్పుడుః"

ఇలా ప్రతిదృష్టాంతమూ ఆశ్చర్యకరంగా ఉంటుంది. కవిగారు ఈ శతకాన్ని వ్రాసిన కాలం ఒకపద్యంలో నిగూఢంగా పొదగబడి ఉంది.

"గెలుపుసాలిది మంచి గెలుపు నిచ్చుచు నుండ
 వానకాఱది యడ్డు వచ్చునొక్కొ
మింటినెల కడింది మేలె సేయుచునుండ
 వన్నెతగ్గెడి నాళ్ల వాసి చెడునె
పదగ దాల్చెడిరోజు పట్టిమేల్చేయగా
 పుడమి బుట్టిన యొక్కఁ డడఁచఁగలడె
జేజేల వెజ్జులు చేరి ప్రోచుచునుండ
 చెలగిన తేలేమి సేయగలదు
మొత్తమున మంచి తాఁచల యెత్తియుండ
చిన్ని దొసఁగులు పడియేమి సేయగలవు
అని పలుకు దాసురాము డిట్లచ్చ తెలుగు
కబ్బమందమునిండఁ జక్కట్లదండ."

గెలుపుసాలు-జయనామసంవత్సరం; వానాకాఱు-వర్షర్తువు; మింటినెల-శ్రావణమాసం (నభోమాసం) వన్నెతగ్గెడినాళ్ళ-కృష్ణపక్షంలో; పదగదాల్చెడిరోజు-పంచమి (సర్పతిథి); పుడమిపుట్టిన మొక్కడు-మంగళవారం (కుజుడు); జేజేల వెజ్జులు-అశ్వినీ నక్షత్రం (అశ్వనీ దేవతలు); చెలగినతేలు-వృశ్చిక లగ్నం (సాయంకాలం మూడుగంటలు).

ఈ శతకం జయనామసంవత్సరం, వర్షర్తువు, శ్రావణమాసం, కృష్ణపక్షం, పంచమి, అశ్వనీనక్షత్రం, మంగళవారం సాయంకాలం మూడుగంటల వేళముగించి నారన్నమాట 99వ పద్యంలో కవిగారి నివాసస్థానం ఏలూరు అని సూచించబడినది.

అతిసరళం, సుకుమారం అయిన అచ్చతెలుగులో రచించబడిన యీశతకం తెలుగుజీవితం నుంచి గ్రహించబడిన చమత్కార పూరితములైన దృష్టాంతాలతో, చక్కనీ తెనుగునుడి కారంతో అతిరమణీయంగా ఉన్నది.

## సూర్య శతకము

సంస్కృత భాషలోని శతకాలలో మయూరమహాకవి రచించిన సూర్య శతకం భావాలలోనూ, భాషలోనూ అతి ప్రౌఢమైనదే కాక మహిమాన్వితమైనది అనికూడా ప్రసిద్ధి కెక్కినది. అదిస్రగ్ధరా వృత్తాలలో వ్రాయబడి ఉన్నది. అనువాదం అంటేనే కవికి పెద్ద పరీక్ష. అందులో మయూరుని సూర్యశతకం అంటే అగ్ని పరీక్ష. శ్రీరామ కవిగారు అగ్ని పరీక్షలో నెగ్గినారు. ఈ శతకం 1902 లో తొలి ముద్రణ పొందింది.

మూల శ్లోకాలలోని భావం ఏ మాత్రమూ జారిపోకుండా, శైలి బిగువు సడలకుండ శ్రీరామ కవిగారు సూర్య శతకాన్ని ఎలాంటి దక్షతతో అనువదించారో మచ్చుకి—

మూలం :-

"తన్వానా దిగ్వధూనాం సమధికమధురాలోకరమ్యా మవస్థా
మారూఢ ప్రౌఢి వేళోత్కలిత కపిలిమాలంకృతిః కేవలైవ
ఉజ్జృంభాంభోజ నేత్ర ద్యుతిని దినముఖే కించిదుద్భిద్యమానా
శ్మశ్రుశ్రేణీవ భాసాం దిశతు దశశతీ శర్మ ఘర్మత్విషో వః."

ఆంధ్రీకృతి -

"కలయ దిశావధూటులకుఁ గన్నుల పండువుగాఁ గనన్పుటో
త్కలనను నూగునూగు పెలఁదాళువు సొంపులు నింప నుల్ల స
న్నళిన విలోచనంబగు దినంబు మొగంబున మొల్చినట్టి మీ
సలనునురేకఁ బోలు దివసప్రభు నంశులు మీకువేలిడున్."

మూలం—

"బిభ్రాణః శక్తి మాశుప్రశమితబలవత్తారకౌర్జిత్య గుర్వీం
కుర్వాణో వీలయాధః శిఖినపి లసచ్చంద్ర కాంతావభాసమ్
ఆదద్యాదంధకారే రతిమతిశయినీ మావహ న్వీక్షణానాం
బాలో లక్ష్మీ మపారా మపర ఇవ గుహో౽హుర్పతే రాతపోవః."

ఆంధ్రీకృతి—

"ప్రశమిత తారకోజ్జ్వల బలంబగు శక్తిని దాల్చి చంద్రకాంత
శిఖి నడంచి యయ్యతను దర్పతమోహర విస్ఫురన్మహో
తిశయినియైన వీక్షణరతిం దగి రెండవ క్రౌంచ భేది నాఁ
గుశలత గాంచు భానురుచి కుట్టి యొసంగుత మీకులక్ష్మలన్."

సూర్యుని బాలాతపమునకు కుమారస్వామితో పోలిక చెప్పే ఈ శ్లోకంలో ఉపమానోపమేయాలకు సమాన ధర్మాలు శ్లిష్టపధాల నాశ్రయించి ఉన్నవి. శ్రీరామ కవి గారు ఈ శ్లిష్ట పదాలను కడు నిపుణంగా అనువాదంలోకి తెచ్చుకున్నారు. "అంధకారే రతిం" అన్నచోట "అంధకారి" అన్న మూలాన్ని "అతను దర్పత మోహర" అని అనువదించి మెరుగు పెట్టినారనిపిస్తుంది. శివపరంగా "అంధకారి" అనడం కంటే "అతను దర్పతమోహర" అనడమే ప్రకృతానికి ఎక్కువ దీప్తి కలిగిస్తుంది. కుమారస్వామి శివుని వీక్షణాలకు ప్రీతి కలిగించే సందర్భంలో శివుని అంధకవధ ప్రసంగం కంటే మదన గర్వహరణ ప్రసంగం ఎక్కువ సమంజసం కదా. గుహ శబ్దాన్ని క్రౌంచభేది శబ్దంగా మార్చడం కూడా కుమారస్వామి ప్రతాపాన్ని వ్యజిస్తూ ప్రకరణోచితంగా ఉన్నది.

విస్తృతములయిన స్రగ్ధలలో ఉన్న మూలాన్ని చంపకోత్పలాలలో అనువదించడం కూడా కవిగారి రచనలోని చక్కదానికి నిదర్శనంగా ఉన్నది.

## విగ్రహారాధన తారావళి

ఇది ఇరవైయేడు సీసపద్యాల లఘుకృతి. శతకాలను ఉన్నట్లు ఈ తారావళికి కూడా శ్రీరామకవి గారు మకుటాన్ని పాటించినారు. మొదటి ఏడు పద్యాలు ఉత్పన్నం కావడం వల్ల మకుట స్వరూపం తెలియడం లేదు. ఈ తారావళికి ఉపోద్ఘాత ప్రాయంగా కవి గారు ఏడు శ్లోకాలు కూడా వ్రాసినారు. ఈ శ్లోకాలు, తారావళి ఏలూరు విద్యానందినీ సమాజం వారి సభలో చదువబడినవట. ఇవి 1900 లో ముద్రించబడినవి.

శ్లో॥ అధునా యథా మమ హృది
స్ఫురతి తథై వాస్మి నిగదితుం శక్తః
వివిధై ర్యుక్తి విచారైః
ప్రతిమార్చా చిత్తశుద్ధి హేతురితి."

శ్రీరామ కవిగారు  సంఘ సంస్కరణాభిలాష కలవారు. అయినా వీరేశలింగం  పంతులు మొదలయిన వారివలె విగ్రహారాధనను నిరశించినవారు కారు.  పైగా  పెక్కు  యుక్తులతో  విచారించి విగ్రహాధన చిత్తశుద్ధి సాధన మని యీ తారావళిలో  స్థాపించినారు.  లోకంలోని సంఘటనలు చిత్తంలో నానా భావాలను  ప్రకోపింప చేస్తవి. దేవాలయం ఒక్కటే శాంత రసాశ్రయం అని కవి గారి విశ్వాసం. మచ్చుకి ఒక పద్యం—

"హిత బుద్ధిఁ జూడ గర్హితుఁడె హితుండగు
　　గురుబుద్ధిఁ జూడఁ బామరుఁడె గురుఁడు
దూరబుద్ధిని జూడఁ జేరువే దూరము
　　పరబుద్ధిఁ జూడనే పరము పరము
అధిక బుద్ధిని జూడ నధికమౌ నల్పంబు
　　గుణబుద్ధిఁ జూడ మరణమె గుణము
పుత్ర బుద్ధిని జూడ శత్రుడే పుత్రుఁడు
　　విషబుద్ధిఁ జూడ నిర్విషమే విషము
దైవ బుద్ధిని జూచిన దారువేని
దైవమే యగు బుద్ధి ప్రధాన మెందు　　　　॥ ఉత్తమ ॥

ఇ తి శి వ మ్.



శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో శ్రీ దేశపాండ్య రామానుజరావు గారిచే
శ్రీరాములు గారి చిత్రపటావిష్కరణము.



"తెలుగునాడు" ఆవిష్కరణ సందర్భమున ప్రసంగిస్తున్న ఆచార్య దివాకర్ల
వేంకటావధాని గారు, కూర్చున్న వారు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు
ఇరివెంటి కృష్ణమూర్తి గారు, దేశపాండ్య రామానుజరావు గారు,
యం. యల్. నరసింహారావు గారు

# వాసు శ్రీరాములు - నాటక కర్త

—శ్రీ యస్. యస్. సుందరేశ్వరరావు

19 వ శతాబ్ది నడుమ జనియించి సుమారరువది రెండు సంవత్సరాములు జీవించి ఆంధ్రభాషకు మహోపకార మొనర్చిన వారిలో దాసు శ్రీరామ పండితులు ప్రాతఃస్మరణీయులు. వీరి జీవిత చరిత్ర 1928లో వెలువడిన దేవీభాగవత ద్వితీయ ముద్రణము నందును, 1944లో ప్రకటింపబడిన "ఆంధ్ర రచయితలు" అను గ్రంథమునందును ముద్రితమైయున్నది. దాసు వారి సంపూర్ణ చరిత్రను దాసు విష్ణురావుగారు రచించిరనియు నది ఇంకను ముద్రణ భాగ్యమును నోచుకొనలేదనియు తెలియుచున్నది. మరియు శ్రీరాములు గారి గ్రంథము లన్నియు ప్రకటితములైనచో 18,19వ శతాబ్దులలోని ఆంధ్రదేశమందలి సారస్వత. సాంఘిక, రాజకీయ విషయము లెన్నియేని తెలియగలవు. ఒక్క దేవీ భాగవతావతారిక యందే అనేక నూతన విషయములు నిక్షిప్తమై యున్నవి. చార్‌మాహల్ రాజులు - కమదన శోభనాద్రి - అక్బరు, షాజహాన్, అక్బరు అల్లుడు జయసింహుడు గోల్కొండ అల్లీఖాను, బుస్సీ, సలాబత్ జంగ్, గౌతమీతీర రామచంద్ర బుధేంద్రుడు, కురుగంటి వేంకటరామ శాస్త్రి మొదలగు చారిత్రక పురుషుల నామధేయములను గ్రంథకర్త స్మరించి యున్నారు. అందు కొన్నిచోట్ల తారీఖుల నిచ్చియున్నారు. వీటి నన్నిటిని చక్కగా సనిపరచి వ్రాయవలసి యున్నది.

శ్రీరామ కవీంద్రుని గన్న పుణ్యసముద్రులు కామమ్మ కన్నయ దంపతులు. ఇష్టకామేశ్వరి వారి ఇలవేల్పు. హరిత గోత్రాలంకారులైన వీరు దేవీ భాగవతమున నేతద్ గోత్రములలోని ప్రముఖులను గొందరిని పరిచయ మొనర్చియున్నారు. వేంకటేశ్వర వరప్రసాదనుభూత కవిత్వ విద్యాపారగులై అనేక ఆంధ్ర గ్రంథములను రచించి యున్నారు. వృత్తిచే వీరు కృష్ణా గోదావరీ ఉభయ మండలములందు మొదటి తరగతి ప్లీడరు. వ్యవహార భారమున కృతి కల్పనమున కవకాశము సాలకయు వీరానాడు ఇన్ని గ్రంథములు వ్రాయగలిగినందులకు నేటి వారికి గుణపాఠముతో బాటు సంభ్రమాశ్చర్యములను కలిగించును, వెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు నుడివినట్లు దాసు శ్రీరాములుగారు "ఈయన సరసకవి, విద్వత్కవి, స్వతంత్రకవి, ఆశుకవి, దాత, నేత, ఇన్నియోగాలు పట్టినవాడు యే కాలంలోనూ కవులలో మృగ్యులే"

తెలుగునాడు, దేవీ భాగవత కృతుల వలన దాసు శ్రీరాములుగారు తెలుగువారికి పరిచితులయినను వారు ఆనాటి రచయితల వలెనె నాటిక రచనను కూడ దొడంగి కొన్ని నాటకములను రచించి యున్నారు. ఆంధ్ర నాటకములనుగూర్చి అమూల్యమైన పరిశోధన సల్పిన డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారు దాసు శ్రీరాముల వారినిగూర్చి ఇట్లు వ్రాసియున్నారు.

"దేవీ భాగవతము" నాంధ్రీకరించి తెలుగు సాహిత్యములో స్థిరస్థానమును సంపాదించుకొన్నవారు దాసు శ్రీరాములుగారు. వీరు తమ 14వ ఏటనే "సాత్రాజితీ విలాసమనెడి యక్షగానమును రచించిరి. ఆటుపిమ్మట అభిజ్ఞాన శాకుంతల-రత్నావళీ-మాలతీ మాధవ - ఉత్తర రామచరితాది పెక్కు సంస్కృత నాటకముల నాంధ్రీకరించిరి. వీరు శాకుంతల ముద్రారాక్షసములను కేవలము అచ్చతెనుగులోనికి చక్కగా అనువదించిరి (1898). మనోలక్ష్మీ విలాస-మంజరీ మధుకరీయాది స్వతంత్ర నాటకములను రచించిరి" (తెలుగు నాటక వికాసము. పుట. 276) దాసుగారు తమ దేవీ భాగవతావతారికలో తమ నాటక నామము

లను గూర్చి ఇట్లు తెలిపిరి. మనోలక్ష్మి విలాస నాటికయు,...సీత కల్యాణ నాటకంబును......కొన్ని దినంబులు వ్యవహారంబున నుండి విశ్రాంతి గైకొని హేవళంబి మొదలు శాకుంతల నాటకమును, రత్నావళి నాటికయు, ముద్రారాక్షస నాటకంబును మహావీర చరిత్ర నాటకంబును, మాలతి మాధవీయ ప్రకరణంబును, ఉత్తరరామ చరిత్ర నాటికయు,మంజరీ మధుకరీయ నాటికయు, కురంగ గౌరీశంకర నాటికయు నను పుస్తకంబులు రచించిరి"

పై గ్రంథకర్త గారి వాక్యముల ననుసరించి చూడగా వారీ క్రింది నాటకములను రచించిరని చెప్పవచ్చును.

ఆంధ్రాను వాదములు

1. అభిజ్ఞాన శాకుతంలము
2. రత్నావళీ (నాటిక)
3. మాలతీ మాధవము (ప్రకరణము)
4. ఉత్తర రామ చరిత్ర (నాటిక)
5. ముద్రారాక్షసము
6. మహావీర చరితము (నాటికము)
7. సీతా కల్యాణము. (నాటకము)

స్వతంత్రములు

8. మనోలక్ష్మివిలాస నాటిక
9. మంజరీ మధుకరీయ నాటిక
10. కురంగ గౌరీశంకర నాటిక.

ఇందు శాకుంతల, మహావీరచరితముముద్రితములైనట్లు ఆంధ్ర వాఙ్మయసూచిక తెలుపుచున్నది. పైపట్టికలో లేని సంగీతరస తరంగిణి యనునాటకము 1907 లో ముద్రితమైనట్లును నద్దానికర్త దాసు శ్రీరామకవియని యాగ్రంథమందే కలదు. ఈ పేరుతో దాసు నారాయణరావుగారు నొకనాటకమును వ్రాసినట్లు ఆం. వా, సూచిక తెల్పునున్నది. తమ కుమారుని సంగీత రస తరంగిణి నాటకమసంపూర్తిగ నుండిపోవుటచే తాము పూరించినట్లు ఆగ్రంథము నందు శ్రీరాములుగారు ప్రకటించినారు.

తక్కిన నాటకముల ముద్రణాది వివరములుగాని కురంగ గౌరిశంకర నాటిక, మహావీర చరిత తప్ప మిగిలిన నాటకములుగాని ప్రస్తుత వ్యాసకర్తకు లభింపమింజేసి దాసువారి నాటక రచనా ప్రతిభను గూర్చియు నాటక కర్తలలో వారికున్న స్థానమును గూర్చియు సమగ్రముగ చర్చించుట కవకాశము లేక పోయెను. అనువాద మహావీరచరిత్ర నాటక ప్రరోచనయందు తాము శాకుంతల ముద్రారాక్షస నాటకముల. నచ్చతెనుగున రత్నావళీ, మాలతీమాధ వీయములను మిశ్రభాషలోను. (తత్సమ సంయుక్తముగ) వ్రాసితిమనియు, కురంగ గౌరి శంకర మనోలక్ష్మి విలాస మంజరీ మధుకరీయ నాటికలు వారుస్వయముగా కల్పించిన వనియు, జానకీ పరిణయ నాటకములో మొదటి నాలుగంకములు తెలుగుసేసి సంగీత ప్రబంధ సహితంబుంజేసి సీతాకల్యాణమను పేరిట నాటకము గూర్చితిమనియు వ్రాసిరి. మొత్తము పై వీరు 7 అనువాద నాటకములకు 3 కల్పిత నాటకములకు కర్తలని ప్రస్తుతము లభించిన సామగ్రిని బట్టి గట్టిగ చెప్పవచ్చును. సంగీత రసతరంగిణి విషయము నింకను శోధించవలసినదే. సంస్కృత నాటకానువాదములలో శాకుంతల, ఉత్తరరామ చరిత్రలకున్న ప్రచారము వేరొక గ్రంథమునకు లేదు. దాసు శ్రీరామపండితుని సమకాలీనులలో పరవస్తు రంగాచార్యులవారు, కందుకూరి వీరేశలింగం పంతులు గారు శాకుంతలాను వాదకర్తలే. ఉత్తరరామచరితము వావిలాల వాసుదేవశాస్త్రి, మంత్రిప్రగడ భుజంగరావు మొదలైన వారినెందరినో అకర్షించినది. రత్నావళిని వేదం వారును, మహావీర, మాలతీమాధవ ములను మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారును రమ్యముగా ననువదించిరి. ముద్రారాక్షసమును తిరుపతి వెంకటకవులు చేబట్టిరి.

లభించిన వానిలో కురంగ గౌరీ శంకర నాటిక చతుర్థాంకములు గలది. పార్వతీ కల్యాణ మిందలి ఇతి వృత్తము. కాళిదాసుని కుమార సంభవ కావ్యము నాధారముగా గొని దీనిని రచించిరో మరి యేతత్ నామ సాదృశ్యముగల పార్వతీ కల్యాణమును నాధారపరచుకొని వ్రాసిరో చెప్పజాలము. ఇది ఆద్యకథ యైనను మిశ్రకథగా దీనిని దాసుగారు తీర్చిదిద్దిరి. కాళిదాసీయమున లేని కురంగ విషయమిందు ప్రధాన కథతోజొప్పింపబడినది. ఈ నాటికను వీరు శ్రీకాకుళం జిల్లా శ్రీకాకుళసమీపక్షేత్ర మైన అర్సవిల్లి (హర్షవిల్లి)

సూర్యనారాయణ మూర్తి కంకితము గావించిరి. పాత్రోచిత భాష ప్రయుక్తమైనది,

వశ్యవచనుడ, మహావిద్వాంసుడును నైన భవభూతి సంస్కృతమున ముచ్చటగా మూడు నాటకములను వ్రాసినాడు. ఆ మూడింటిని దాసు వారాంధ్రీకరించిరి. పురాణకథకు నవ్యత నాపాదించి నాటకోచితముగ రసపుష్టి కూర్చుటకు మహావీరుడు ధృఢవ్రతుడునునైన శ్రీరామచంద్రుని కథ మహావీర చరితము. శీర్షిక యందలి వీర శబ్ద ప్రయోగము చేతనే ఈ నాటకము వీరరసప్రధానమని చెప్పక చెప్పుచున్నది.

> అప్రాకృతేషు పాత్రేషు యత్ర వీరఃస్థితోరసః
> భేదైః సూక్ష్మైరభివ్యక్తైః ప్రత్యాధారం విభజ్యతే.

అన్న భవభూతోక్తిని

> ప్రాకృతంబులు గాని పాత్రంబులందుఁ
> దగులవలయు సూక్ష్మభేదములచేత
> నెల్ల వాక్యంబులనుఁ దేటదెల్లమగుచు
> వివరణ సమాజసంబైన వీరరసము.

అని దాసుగారి అనువాదము. తారకనామ మంత్ర జపధన్యులయినట్టి దాసుగారి కెట్టి దురవబోధమైన మూలమైనను కొట్టినపిండివలె వారికి వశమగును భవభూతి రచితములగు నుత్తమోత్తమ శ్లోకములలో నొకటియైన

> ఆనందాయచ విస్మయాయచ
> మాయా దృష్టోఽసి దుఃఖాయవా
> వైతృష్ణ్యం ను కుతోఽద్య
> సంప్రతిమమ త్వద్దర్శనే చక్షుషః
> త్వత్సాంగత్యసుఖస్య నాఽస్మి
> విషయిః కింనా బహూవ్యావృతై
> రస్మిన్విశ్రుత జామదగ్న్యై
> విజయే పాణౌ ధనుర్జృంభతామ్. (5.59.)

అను శ్లోకమునకు

> సంతసమాయె విస్మయము
> చాలఁగఁబుట్టెను నిన్నుఁజూచుటన్
> వింతగవంతయుంటొదమె
> నీకు విరోధము సేయఁబూనుటం
> జెంతనె నిల్చి మైత్రిసుఖసిద్ధినిఁ
> బొందగ నోమనైతినే
> నింతకు మాటలేలః
> ధరియింపుము ధనస్సును బాణియందికన్.

దాసువారి అనువాదము.

ఈ విధముగా నీనాటకమంతయు చక్కని చిక్కని తెనుగురచనతో నడచిపోవును.

సావధానత లేమియు, సమగ్రముగా దాసుగారి నాటకమాల లభింపమియు కారణముగా నీవ్యాసమొక అగగౌరవ్యాసమైనది. పండితులైన వారిట్టి సాహసమును మన్నింతురుగాకః

---

శుభాకాంక్షలతో

# శ్రీ సూర్యచంద్ర ఆటో వర్క్స్

(మోటారు గేర్ వీల్సు రిపేరింగు మా ప్రత్యేకత)

3 వ రోడ్,

బ్లాకు నంబరు 8, ప్లాటు నం. 100,

ఆటోనగరు, విజయవాడ-7.

ఫోన్ : 86293 P. P.

ప్రొప్రయిటర్ :

రావూరి సత్యనారాయణ

శ్రీరాములు గారి రచనలలో కొన్ని -

# పద్య రత్నములు

### దేవీ భాగవతము

సీ. వాలారు చూపుల నగలు వడ్డికిఁ బార
 శుముఖంబులు చెక్కులకు సమర్చి
కదలు వాతెఱ కెంపుకాంతి గంతులు
 వైవషడ్జాదికముగాఁగ స్వరముఁ బాడి
గిలుకు టందియ గజ్జెయులివు వాడోడుగా
 ధ్రువ ముఖంబులను బల్లవు లమర్చి
యగగుఁదమ్ముల సొంపుబెడఁగులొడలునింద
 మెల్ల మెల్లన జతుల్ మేళగించి

తే. గీ. పసదనంబుల శృంగార రసము లొలుక
 సరిగ కుచ్చెళ్ళు మీఁగాళ్ళ సరది కొనఁగ
 భావరాగాధిగత తాళపక్కి నెఱిఁగి
 వెలవెలందులు నటనముల్ సలిపిరచట.

(పు. 692ప.)

ఉ. గంగ దయారసంబు సెల
 గంగ సుమర్త్యుల మానుషత్వమే
 గంగ నుపాయ మొండుకలు
 గంగ దలంచితి మీవు భూమికే
 గంగ ని శ్చిత నుంగలయ
 గంగ నిపుట్టుదు మేము నీకు వే
 గంగ డుపాసఁ బుచ్చి తొల
 గంగ జలంబుల ద్రోయుమీ మమున్.

(అష్ట వసువులు గంగను ప్రార్థించుట. ఎనిమిది మారులు "గంగ" అని ఆవృతమగుట చమత్కారము.) (ద్వి. 92 ప.)

సీ. సారంగము వరాళి శంకరాభరణంబు
 నక్షులు కొప్పు నూగారునయ్యె
బలహంసమును శ్రీయు లలిత పున్నాగంబు
 గమన శ్రవణ నాభిగతులు నయ్యె
కవితాచలయు చక్రధరకళ చక్రవాకంబు
 జఘనంబు హాసంబు స్తనములయ్యె
మధుర వనాటంబు మలయమారుతమును
 చరణ యుగ్మంబు నుచ్ఛ్వాస మయ్యె

గీ. అపురపుర యేమి చెప్పనయ్య బల యధర
 మెత్త రాగంబులన్నియు నింపు సొంపు
 కులుకు పలుకులు వెయ్యేల కోమలాంగి
 మయిదలంచెద సంగీత మయమటంచు

[కవిగారి సంగీత శాస్త్ర పాండిత్యమున కిదిమచ్చు తునక].

సీ. రోలంబ జాలంబ యాలంబ కచపాళి
 కాకున్న విరుల సంగాత మేల
చిందంబు నందంబు చందంబు కందంబు
 కాకున్న శబ్దసాంగత్య మేల
బాకాలలోకాల తూకాల జంఘలు
 కాకున్న మంగళ క్రమము లేల
ముకురాల నికరాల నికరాల చెక్కిళ్ళు
 కాకున్న సొగసునందు గనగనేల

గీ. నడుమొకటి మాయ ముష్టిలో బడియె గాని
 యింతి యవయవ సౌభాగ్య మేమి చెప్ప
 కాపురంబుండు నహహ శృంగార లక్ష్మి
 జారు పంకేరుహాస్య బంగారు మేన.

ఉ. భారతవర్ష సంభవుల భాగ్యమె
 భాగ్యము మాధవాంఘ్రి సే
 వారతి గల్గి సంసరణ బంధము
 లూడ్చి గుణప్రపంచమున్

మీఁటి యఘాటవిన్ నరికి
మేలగు మార్గము పట్టి మోక్షం
క్ష్మ రమణీయులై పొనరు మేటులు
వారల నెన్న శక్యమే.

శా. ఉద్యద్ద్యోతటినీ తట ప్రరుహక
వ్యోద్యాన సందేహ సం
పాద్యాత్మీయ జటాచ్ఛటా
ప్రవిలసద్బాలేందు రేఖాలతాం
తద్యత్యాదృత సుందరాకృతివరా
యల్లూరి సోమేశ్వరా॥

## తెలుఁగునాఁడు

### వైదికులు

శా. అస్సె;
చూస్సివషే; నాషే; చెవుడషే,
అష్లాగషే; యేమిషే;
విస్సా వఝులవారి బుట్టిన షే;
యా విస్సాయ కిష్సారు షే
విస్సం దెంతడివాఁడె యేళ్ళు పదిషే;
వెయ్యేళ్ళు కీడెసుమా;
ఒస్సే బుట్టికి యీడషే;
వాయిషు కెముంచుందిలే మంచివా
ర్చెస్సె; యందురు శ్రోత్రియోత్తమ
పద శ్రీ లాంధ్ర దేశంబునన్

### నియోగులు

సీ. మెలిఁ బెట్టి విడిచిన మీసాలపై గొప్ప
నిమ్మకాయలు రెండు నిలుపవచ్చు
తేటగా దెల్లఁగా తెగఁగాలు లంకాకు
పొగచుట్ట జుంజురు బాల్పవచ్చు
నడువీధి రెడ్డి గాలిగి రచ్చదీర్చు బో
సివిలు జడ్జిలని చెప్పవచ్చు
అసడుగాఁ బొసఁగించి నొసటఁ బెట్టిన బొట్టు
వొక్కమా "ఉఖని యూఁ" దవచ్చు

గీ॥ వడివడిగఁ జిన్ననాఁడైన వడుగు నాఁడు
తడఁబడుతుఁ జెప్పుకొన్నట్టి తప్పు సంధ్య
ముక్క నాలుగు నిముషాల ముగియవచ్చు
బళిర! యనవచ్చు లౌకిక బ్రాహ్మణులను

### స్మార్తులు

శా. అచ్చమ్మా యిది యేమిటే;
రెయిండే ఆసీ యిదేన; సరే
బుచ్చమ్మా వినలేదటె
గడియలోఁ దోవచ్చునే కాశికిన్
అచ్చో దేహము గ్రుడ్డుకోదటె
అయో ఆసౌఖ్య మేమందునే
యిద్చారాఁశ్య మటందురైరిను
గనియెంతే వింతవి ప్రాంగనల్

### వైష్ణవులు

సీ. చీటికి మాటికి శ్రీమతే రామాను
జాయనమో యంచుఁ జదువు సొగసు
నిరుపమ భక్తిచేఁ బెరుమాళ్ళను ఫిరాట్టు
దిరువడిఘళ్ గొల్చియై జఁగు సొగసు
సారె సారెకుఁ దిరువారాధనంబులఁ
దిరువాయి యొడిఁనోటఁ దెలుపు సొగసు
జ్ఞానులఁ గనియడియే నడియేదా
సోహమ్మనుచుఁ బల్కునట్టి సొగసు

గీ॥ పరఁగఁ బన్నిద్ద రాళ్వార్లఁ బరమభక్తి
మించి తిరుమంత్ర మొనరసాయించు సొగసుఁ
బొగడుచో వేయి నోళ్ళకు మిగులు గొంత
వైష్ణవ బ్రాహ్మణులదె దైవప్రపత్తి

### చక్కట్ల దండ

సీ. ప్రాతకరణమెప్డు వ్రాయుచుఁ గూర్చుండ
మేత కర్ణము దినుదైతు సొమ్ము
మంత రాల్చెప్పుచు మల్లు బొట్లుండంగ
నే గాలి దిగమ్రింగు నెల్లు బొట్లు
కూచమ్మకుండతో గూర్చి పెట్టును నుంత
మాచమ్మ తాఁజేసి మాయఁజేయు
కంపునోరగు మామ గడియించుచుండగా
మంచి నోరల్లుండు మట్టుపఱచు

గీ. పాటు పడువార వొక్కఁ అప్పాటు వలన
కడుపు నిండించుకొనుచుంద్రు కడమవారు
అని పలుకు దాసు రాముఁడిట్లచ్చ తెనుఁగు
కబ్బ మందము నిండఁ జక్కట్ల దండ.

# తెలుగు పల్లెసీమ

## శ్రీ దేవీ భాగవతములోని కృత్యాది దేవతా స్మరణాదికము నుండి

## గ్రహింపబడిన అల్లూరు గ్రహార వర్ణన

వచనము : నా బాల్యమున నాకు నానావిధ సౌఖ్యంబు
లకును వినోదంబులకును నాటపట్టై నన్నలరించిన
యల్లూర గ్రహారంబు నభివర్ణించెద.

సీ॥ భాగ్యప్రకర్షంబు భారతవర్షంబు।
కలిమితొయ్యలిపీడు తెలుగునాడు
దుస్తుముల్లెలబారు ముస్తఫాన్సరుకారు।
కోటీశ్వరుల తల్లి కొండపల్లి
సఫలకాండంబు కృష్ణానదీ ఖండంబు।
గొలుచుకొట్టమ విన్న కోటసీమ
ప్రాజ్యంబు కమదిన వారి సామ్రాజ్యంబు।
క్షమనెల్ల బేఁడల్ చారుమహలు.

తే. గీ. దానధర్మము గలవారు దాసువారు।
చేరిపాలింతు రల్లూరు సిరికొథారు।
ఆది నివాసంబునకు యోగ్యమని తలంచె।
సంగతసుకీర్తి సోమేశ లింగమూర్తి॥

సీ. గుంటయొడ్డున నొంటి గూర్చుండి మాయూరి
కలుములు గన్నమ్మ యలుగులమ్మ
నిట్టిత్రాడులలోన, నిలిచి యెల్లరిక్షేమ।
మరయుచుండెడియమ్మ యలుగులమ్మ
తా శిలారూపంబు దాల్చి మగాటిహ।
యామెరింగినయమ్మ యలుగులమ్మ
ఎండవానలకోర్చి, యెల్లప్పు బయలులో।
నణఁగియుండినయమ్మ యలుగులమ్మ॥

తే. గీ. ఆలమందలఁగాపాడు నలుగులమ్మ।
చిలిపిగోగాలదొలగించు నలుగులమ్మ
గ్రామదేవతగానొప్పు కనకరాశి
పదిగి నలరారు నల్లూరు పల్లెటూరు॥

సీ. ఎలయెండ చెట్లసందులనుండి గోడల।
దవిలి తానిలువుట దద్దములుఁగాఁగ
గొనగొనజను నింద్ర గోపసంఘాతంబు।
పందిళ్ళలోఁ జిన్ని పగడములుగ
చూరుపట్టీయలఁ బిచ్చుకదంపతులదాలు।
చెక్కితీర్చినయట్టి చిత్రములుగ
దూలాలగూళ్ళసం దులనుండి వెదలి మ్రో
గెడ తుమ్మెదలమ్రోఁత గీతములుగ॥

తే. గీ. కెరలి వాకిళ్ళ తూనీగ తెరలు మూగి।
నెర బుడేదారుగెంబట్టు పొరపనందు
సన్నయుల్లదగాగ నా షాధలక్ష్మి
పగిది దనరారు నల్లూరు పల్లెటూరు॥

సీ. ప్రాఁతగొంగడి వీపు పైఁ గప్పి బుజమున।
గొంకికర్రను మోదికొంచునడచు
నుచ్చుఁ బ్రాఁతలపింజ గ్రుచ్చి మున్మొలగట్టి।
మత్తానుపొత్తి వేమారు మడచు
కదలి పారెడి గొత్తె గమిచేలఁ బడకుండ
తాసె తాసేయటంచు దగిలిపలుచు
తోడేలు బొదఁగాంచిజాడనే చేయెత్తి।
నిక్కి ట్రూహోయని కుక్కబిలచు

తే. గీ. అలు తలనిడుకొని వచ్చునట్టియటిక
నున్న ఛల్లయుఁ దమిదకూ డుప్పుగల్లు
మెల్లఁగా ఁ మ్రింగఁ గొల్లని బెంచుతల్లి
పగిది దనరారు నల్లూరు పల్లెటూరు ;।

సీ. ఇసుకబావిఁ బనంటు లిడి ముంచుచును వంగ ।
తోటలకును నీళ్లు దోడువారు
చిలగడంబులమళ్ళ జేతులతోనిండు
బుడ్లతో దొణదొణ బోయువా
నిమ్మ నారింజ దానిమ్మచెట్ల కుదుళ్ళ
నుం బేడపెంటల నునుచువారు -
ఆకుకూరలఁగల్పు లేకుండ దివిచి కాఁ ।
డలఁ బచ్చపుఋవుల దులుపువారు

తే. గీ. పెద్దబెండల మోళ్ళను బీకువారు ।
కాకరలకును బందిళ్లు కట్టువారు
మార్గశీర్ష మహాలక్ష్మి మందిరంబు
పగిది నలరారు నల్లూరు పల్లెటూరు ॥

సీ. చెలగి కళ్ళముల గింజలు మేసి ప్రాఁజింత
తొరదుల గుబగుబల్ నెరపు గువ్వ
కట్టాసఁ జని గంటె కంకి నోటసుబెట్టి
వినువీథిఁ గిలకల యనెడు చిలుక
చెంగావి పెనురావి చివురు నిండుగమెక్కి
కూకూయనెడి మద కోకిలంబు
పొదలలో మెదలు లేఁ బురువుల సావడి
చెట్టెక్కి గుమ్మను జెముడుకాకి

తే. గీ. కదసి వరిచేలలో గూళ్లు గట్టి పెలుచ ।
బలిసి నటనంబు గావించు బరతపిట్ట
గలిగి జనులకు శ్రవణసౌఖ్యప్రదంబు ।
పగిది దనరారు నల్లూరు పల్లెటూరు ॥

సీ. పొదలపై నీలాలు బోలు పరింగపం ।
డ్లకు జేయిసొన్ను బిడ్డలను గల్గి
పొలములో గొంతెత్తి పొలిపొలియోయంచు ।
వరికుప్పనూర్చు పాలెరులుగల్గి
అరువు బేరముల గు జ్జరినేసి నన్నంబు ।
ముతకంచు నుదుగు మాలతలు గల్గి
కోడిపందెములకై గుమిగూడి గొల్లున ।
సడిజేయు చిల్లర జనముగల్గి

తే. గీ. దేశవాళి తుపాకితో దెబ్బలోన ।
బిట్టలను గొట్టు మతరాచ పిండుగల్గి
శిశిర ఋతున్నామియైన లక్ష్మికిని దొడవు ।
పగిది నలరారు నల్లూరు పల్లెటూరు॥

వ. మరియు విసువక కసవులు మెసవు నాలమందల యందుండి యెదగొన్న సెలపెయ్యల కదసి కొమ్ముల గంగడోళ్లు నాకి నాకి ముట్టెలాకసంబులకెత్తి మూమాచు నాబోతుల అంకెల కులికి పఋపులిడు లేఁగదూడలంబట్టగమకించి వెనువెంట నంట చను గొల్లపిల్లకాయల గవ్వలమొలనూళ్ళ నందంద దగిల్చిన యిత్తడి చిరుమువ్వల అవశి కదిరిపడి గంతులిడు తరపుల కాళ్ళనుండి వెడలి జుమ్మను జోరీగ పేరీగ చిట్టీగ తండంబులను

ఈగతండంబులును మేనులంట రెండుచేతుల నిరుబరులఁ గోకికొనుచు గొంగళ్లు వెదకుచు వరి గడ్డి నిప్పుతొండల పొగమఋఁగుకుం జేరి మట్టాకుచుట్టిన పొగచుట్టల నగ్గియంటించి నోళ్లనిడి తగుమాత్ర మెగబీల్చి దిగవిడచుచుండ నెత్తినిడి తెచ్చిన చలిదికుండల దించి యుప్పుగండ్లగలుప వంగి మైజారుచెఱగులు వ్రేలాడ నూసులాడు గొల్ల పూఁబోడుల సరసంబులాడు పెద్దగొల్లల తొంట్ల

వెనుక తోకలాడించుకొనుచు నొడళ్లు విరచుచు గాళ్ళుసాచి నిక్కు వేపిజాగిలంబులును

వేపిజాగిలంబులు మోరలెత్తి మొఱగిన విని భయభ్రాంతంబులై పరచుచు వెనువెన్క సూచుచు దోకలు మడచి పులుగుపొదలం దూరి పండికొని యున్న కుందేలు నక్క తోడేలు కొరణాసి మున్నగు జంతుసముదాయంబుల వేటాడగమకించి పరవదోలి వలలుచ్చులు పన్ని చుట్టుతిరిగి కూకలు వేయుచు జప్పుళ్ళుజేయుచుం దిరుగు వేటగాండ్రం గాంచి తావులువెదలి తెక్కలార్చుచు నోరలోరల జెట్టుచేమల పట్టులం జూచుకొను పావురము కాకి గద్ద గువ్వ ఏండ్రింత పాలజువ్మ చిలుకలు మొదలగు పులుగుమొత్తంబులును

చిలుకలు మున్నగు పులుగుమొత్తంబులు చవచవ నెగసివచ్చి కంకికొక్కుండుగా వ్రాలి గింజలు ముక్కులం బొడిచి తిత్తులు నింపి యత్యాశావశంబున దంటుపై గూర్చుండి సజ్జకంకియూచి మొదలంటగొఱుకుచు జాగుసేయుచు నిటునటు మెడ ద్రిప్పి సూచుచుండ జేనినడిమి మంచెమీదనుండి కలకలంబు విని చెట్టేలు త్రాడు పలుమరు విసరి యిద్ద తాప్పను బెను మోత నులుకంజేపి మంటి యుండల వడిసెల నిడి త్రిప్పి యేయు కాపులును

కాపులు తమ ప్రాతరుపాహారార్థంబు లేతకంకుల కరయుచు గ్రిక్కిరిసి గింజబరువున నొంగి యున్న దంటుల నిటునటు పాయంద్రోయుచుం దారివెట్టి చనుచో బుసబుసలాడుచు మెల్లమెల్లనం ద్రాకు బెంజేరుగున్నలకు బెదరి కేకలుశైవ జేలదాపు పుంతవెంటం బోవుచు మంచెకుం గట్టిన యంచెదుడ్ల విరగలాగి పలుదెబ్బలం జావంగొట్టి చేలగట్లకీడ్చిన యుపకారంబునకుం బ్రత్యుపకారంబుగా నిచ్చిన కంకులంగొని నలిపి వడిగట్టి యిండ్లకుంజను బాటసారుల నయ్యా! యేమితెచ్చితివని యొడిబట్టి విడలాగు పసిబిడ్డలును

పసిబిడ్డ లేపుమీరి గుంపులుగూడి మెట్టవుట్ట చెట్టు చేమలనక చిరుగోచులు వ్రేలాడ నవ్వపాటి యూటికట్టలం జిరుతబిళ్ళలం జేతులంబూని యాటలాడజొచ్చి యలసి వడిబ్రొద్దుల కిసుకబొందలకుం జేరి దిగ్గి జలకంబులాడి మేనులు సూర్యాతపవశంబులు చేసియు విడువని మంటి చారికలు పీపులగాన్పింప నిండ్లకుజేరిన బండ్లిగొఱకుచు వెఱపించి కొట్టంబోవు తల్లుల కడ్డమై వంగివంగి కట్టుబట్టుకొనుచు చిన్నబిడ్డల కేమితెలియు నూరుకొమ్మని వెద వెద ముసలి మాటల గోడంద్రం జంకించు ముసలమ్మలును

ముసలమ్మల యొద్దంజేరి సీతు లుపన్యసించుచు కావడి పెట్టెలం గాజుకుప్పెల నించిన కాలువనీరు గంగోదకంబవి నమ్మించి నెత్తింజల్లి బొమ్మల పటంబు విప్పి యేలపాటలు బాడుచు యెలుంగెత్తి యర్థంబులు సెప్పుచు మగనిప్రక్క రామహరే యని పల్లవినను సంధించుచు బైటకొంగునం గట్టి వీపులం దగిలించుకొనిన పసిబిడ్డనుం జూపి ముద్దయడుగు కాశికాఁళ్ళ ముద్దరాండ్రకుం జేటలెత్తి కాపెతలు చాటుగా దివిచి యిచ్చు చోడె కొఱ్ఱ చామ సజ్జ వరి ధాన్యంబులును

వరిధాన్యంబుల నూర్చి రాశిచేసి కొల్పించి సంచులంబోపి కుట్టి యెద్దు దున్న వీపునం గత్తళంబులు పన్ని గంతపైచి శెలగశంబులు బిగించి యెత్తి కబాడంపుదుడ్లు బజాలనిడి పెరికాటంబు సేసి యిండ్లకుం గొంపోవునెడ పునాస వ్యవధి గడచిపోయినదని కాపుల నడ్డగించి కలహంబుల వెట్టుకొను పెట్టుబడి కోమటులును

కోమటి యింటికిం బసుపుకొమ్ముల్లిపాయ మెఱపకాయ చింతపం డుప్పుగల్లనుచు వచ్చి ధాన్యంబులు దెచ్చి క్రుమ్మరింప పెల్లకాయ పొల్లుగుల్లయని చెఱగి చెఱగి సోలంబోసి చూచు తలగీతయని కాని దుగ్గాని విలువకట్టు గట్టువాయి కోమటి కొమ్మలతో బలుగతుల బోరాటములు

సేయు కాపు గొల్ల గవల యీడిగ మాల జవ
రాండ్ర దొలంగుదొలంగుమని బోకరించి గొణిగి
కొనుచు దారిబోవు జలాహరణపరలగు స్మార్త వితం
తువులు గుడ్డ గుల్ల చిళ్ళ పెల్ల పెంకులం ద్రొక్కి
వానిందిట్టి తిట్టి పునస్స్నాన ప్రయత్నంబులు సేసి
మాతికేగి తోడు భాంశశతంబునకుం బట్టుకాలంబు
వలన మధ్యాహ్నంబు దాటినంగని వంటలుకాలేదని
కోపించి యుటికి చీవాట్లు పెట్టు గృహమేధులును

గృహమేధులు తమతమ ముంజావదుల పీన
కట్టుబద్దలు చీఱుచు మామిడి జీడిమామిడి మఱ్ఱి
జువ్వి రావి మొదలగు వృక్షంబులందెచ్చి భోజన
భాజనంబులుగా గుట్టుచుండ మడిసంచులు వీపుల
వ్రేల బుడిచెంబుల మూతులకంగవస్త్రంబులు
గట్టి మొలలబిగించి తలనొక ప్రాతశాలువజుట్టి
యొంటిపొరయట్ట చెప్పుల దొడిగి దర్భాసనం
బులు వీపులకడ్డంబుగా జొప్పడ నేతెంచి పరదేశు
లమని మహావినయంబు దోపంజెప్పి యల్ల నొకచో
గూర్చుండి యాశీర్వచనపనసం దొడిగికొనినం
జూచి మాయింట భోజనంబు సేకూరదని ఎన్ని
విధంబులం జెప్పినవినక నానాప్రకారంబులం బ్రా
ర్థింప నెట్టకేని యంగీకరించినతోడన దమక త్తెసరని
మెల్ల మెల్లగాజారవిడచి చెప్పి స్నానంబుచేసి మడి
కట్టుకొని పంధ్యావందనాది కృత్యంబులు నిర్వ
ర్తించి దేవతార్చనచేసి ప్రొయిమీదనున్న తప్పెల
ద్రింపుకొని పచ్చడిమజ్జిగలతో గడుపునిండ సాపడి
యెద్దేనరుగుమీదం బండుకొని గుఱవెట్టు పాంథ
వైదికశిఖామణులునుంగల్గి యత్యంత సౌఖ్యాస్పదం
బయి నాబాల్యదశ ననేకవినోదంబు లనుభవించిన
పల్లెటూరగు అల్లూరగ్రహారంబు స్మరింపక నామనం
బన్యంబుగ్రహింపనేర దదియెట్లనిన

శా. శ్రీలంజెన్నగు నాలమం దలును
దక్షీరంబులుఁ వెన్నలున్.
జాలఁ మీగడలుఁభుజించి పరమై
శ్వర్యంబు వేరొక్కటీ
భూలోకంబున గాన కెప్డును మహా
భూతప్రభావంబులఁ
లోలోనం గడు మెచ్చి రంజిలితి న
ల్లూ రగ్రహారంబునఁ

ఉ. పచ్చలబోలు పర్ణముల
పైపయి నిండుగగాచి గొల్లుపం
డ్లొచ్చెములేక చిట్టడవి
నొక్కమొగిఁ బగడాలునిండుగా
గ్రుచ్చినయట్ల తోప నది
గోయని యెచ్చటలేని సంతసం
బచ్చుపడంగ గోసిన సు
ఖాతిశయంబు గణింపశక్యమే ॥

మ. అహహా నామది నేటికి స్మరపురా
దాయావు లా లేగ లా
మహిషీవ్రాతము సజ్జచేలనడుమన్
మంచెల్ దదారోహణ
స్పృహలుఁ గూయనుచుఁ గడుఁ వడిసెలఁ
జేయార్చి యేయఁక్రియా
మహిమం జిల్కలు లేచి కూయుచు నభో
మార్గంబునం బారుటల్

ఉ. వేసగి నెండతాకునకు
వేసర నీయక లేగదూడలఁ
బీసగి దొంకలందిడిన
వేళ గనుంగొని పోయి యాత్మ ను
ల్లాసముమీర నందు బది
లంబుగ మేపగ లేతపచ్చికఁ
గోసిన నాటి తుష్టికిని
గోటిధనంబు సమంబె యారయఁ

ఉ. బాదవచ్చెల్క యొద్దులను
బట్టినపచ్చికపట్ల బూరి బి
య్యాలకుబోవు గొల్ల జవ
రాండ్రొడి నిండఁగ గ్రోసిక్రోసి తా
రొదక త్రోవనోవుతరి
నూరిదొరఁ సగబాలు పెట్టుడం
చాడిన నట్లుసేయుఁ గొని
నట్టి వినోదము విస్మరింతునే

ఉ. ప్రొద్దుటిపూట చిట్టడవి
పుంతల నెయ్యురగూడి త్రుమ్మర౯
గద్దరి సుద్దులుం జిలిపి
గంతులు గొంతుకయెత్తి యెద్దియో
పద్దెము బాడుచు౯ నగుట
బాపటపాకులు నూటికట్టులు౯
బొద్దిచివుళ్ళనుం దునుము
పోడిమి నేడును పీడ దాత్మలో౯

ఉ. పచ్చికపట్ల మంచుబడి
ప్రాతర నేహరముందు బచ్చలన్
గ్రుచ్చిన పీటముత్తెములు
కూర్చినరీతి వహింప నెంతయు౯
మచ్చిక సాలెపుర్వు లిది
మాదని నిక్కుచు జిల్గువల్వలన్
హెచ్చుగ నచ్చటం బఱచి
రే యని యెంచగ నొప్పుచోటులన్
రచ్చలు సేసితి౯ సుఖత
రంబుగ బిన్నలగూడి వేడుకన్॥

చ. బలమును నింటిలో జరుగు
బాటును దల్లియుఁ దండ్రియుం దయా
కలితమనీషఁ బెంచుటయు
గమ్మని నీరును గూరలాకులున్
గలమసమృద్ధియుం జెరువు
కానయుఁ బాడియుఁ బంటయుం గడుం
గలిగిన పల్లెటూరనగు
కాపురమే సుఖమంచు నెంచెదన్

చ. తలఁచెదఁ జెట్టులెక్కిన వి
ధానము కొమ్మచులాడినట్టి విం
తలు గిజిగాని గూళ్లాడిసి
తన్నఁగ నెత్తున వ్రేల నూగు గొ
మ్మలకును గాళ్లసాచిన క్ర
మంబును మొగ్గలజగ్గు పిల్లలం
బిలుచుక గ్రక్కునం జిఱుత
బిళ్ళలు నాడిన యెల్ల వేడుకల్

చ. పొలమునకేగి నాటు
పువుబోడులు గొంతుకలెత్తి తుమ్మెదా
కలకలనవ్వుతాయనుచుఁ
గామమపుట్టగ గర్వువచ్చె నం
చలరఁగ బాడగాఁ వినుచు
నయ్యెద నయ్యెద నేతికల్వ పూ
వులఁ జిదుమంగ నాచిఱుత
పూటలు మూటలు నిష్కకోటికిన్

ఉ. చక్కని పెద్దచెర్వుదరి
చాయలఁబట్టిన నాచుపట్లఁ బెం
పెక్కుచుఁ జిత్రకంబళము
పేర్మివహింపఁగ నెట్టిగల్వ పూ
లక్కడ నక్కడం బొదలు
నందము గన్గొని యీదువారితో
గ్రక్కున బందెముల్ వయిచి
కాఁదలదున్మిన నాటి సంతసం
బెక్కడనేనియుం గలుగు
నేయిక నెన్నటికేని ధారుణిన్॥

ఉ. మేకలమందలన్ బసుల
మేపుచు గొల్లలగూడి నల్ల రే
గాకుల చిక్కముల్ పొనఁగ
హత్తుచు వీపులకున్ దగిల్చి ని
ర్వ్యాకులులై మెదల్ దిగువ
వాంచి చనం గని మెల్ల మెల్లగా
వాకు బిగించి పీపునకు
బ్రాకిన కోడిగ మప్పుడెంత సౌ
ఖ్యాకరమయ్యెనో తెలియ
నామదియొక్కటి కీధరాస్థలిన్॥

చ॥ అనుదినమొకరీతి దగు
నా దిరిసెంబుల పూలతావులా
యనుభవమెల్ల మావశమ
యందును జల్లని నీటిబొంద లే
మని కొనియాడవేసగి వ
హా మునుమాపున జల్లగాలికిన్
దనువిడి సైకతస్థలుల
దద్దయు నాటలబుచ్చు ప్రొద్దులన్

చ॥ తొలకరి వానలం జలము
తో దగనిండిన గుంటపట్ల గ
ప్పలు గురుటక్కటక్కరక
పట్కరటన్ కరటత్వనాగ న
వ్వల గడుగుంయిగుంయిగుయి
బంగుయిగుంయని యీలకోడులున్
బలువిడి గూయ నద్భుతము
బాటిల వింటిని గంటి సౌఖ్యమున్ ॥

చ. పిడుగులు పెళ్లనన్ మొఱయ
భీతిలి భీతిలి యుర్ములుర్మగా
బిరబిర మ్రోతకిట్టునటు
బారి మెఱుంగులు తళుక్కుతళుక్కుమం
చదరిన గన్నులార్చి కర
కావళి నచ్చెరుపాటుతోడ జే
తులనిడి వానకుం దడిసి
తొల్కరి నాటల ప్రొద్దుబుచ్చితిన్

చ, సరస వసంమందును ని
శాముఖవేళల జల్లగాలికిన్
బరువుగ బూయు నయ్యడవి
మల్లెలవాసన నాసికాపుటాం
తరముల జొచ్చి డెందమున
దద్దయు సౌఖ్యముగూర్పు వెన్నెలన్
బరపులపైచి వందుకొను
భావము నేదలపోయకుందు .

చ. సొలయకమెట్టలం దిసుక
చోటుల బిచ్చుకగూళ్ళు గట్టి పాం
సులత వహించివచ్చి యొక
చో దిగుబావిని జల్కమాడి మే
నుల తడియార్చి పెద్దలకు
నుం దెలియంబడునంచు మెల్లగా
నిలుసొరవౌవు నాకపట
వృత్తిని నే దలపోయకుందునే.

వ. అట్టియల్లూరను పల్లెగ్రామంబున

తే. గీ. పూరియింటనె పలువర్షములు వసించి
యారికన్నమె కొన్ని నా ళ్ళారగించి
యుప్పుపట్టుల పన్నంది యోర్చి యోర్చి।
సోమలింగడుమాయూరె సుఖద మనియె.



## దాసు శ్రీరాములు గారిచే రచింపబడి ప్రకటితమైన గ్రంథములు

### తెలుగు నాడు

(ఆరవ కూర్పు)

ఇందు సంఘ విషయముల గూర్చి ఆంధ్ర బ్రాహ్మణుల ఆచార వ్యవహారములు
స్వాభావికముగ వర్ణింపబడినవి. వెల రూ. 2-00

### అభినవగద్య ప్రబంధము

(మూడవ కూర్పు)

యూనివర్సిటీ విద్యార్థులకు పనికివచ్చు నట్లుగా నీవరకెన్నడునూ లేని యొక కల్పిత కథతో
సంప్రదాయ పద్ధతిన నవ్యయుగమున రచింపబడిన గద్య ప్రబంధము. వెల రూ 2-00

### శ్రీమదాంధ్ర దేవీభాగవతము

దాసు శ్రీరాములు గారికి మహాకవి బిరుదము చేకూర్చిన మేటిగ్రంథము.
(త్వరలో వెలువడును)

ప్రతులకు :

**మహాకవిదాసు శ్రీరాములు స్మారక సమితి**
వాణీసదనము, 3-4-885/A, బర్కతుపురా,
హైదరాబాదు-27.